# పేరాజు - ప్రేమకండూతి

## కథా సంకలనం

ప్రథమ ముద్రణ
1000 కాపీలు
15-10-2002


ముఖచిత్రం : **డా. మంత్రిప్రగడ సీతారామ్**

ముద్రణ
**దత్తసాయి గ్రాఫిక్స్**
గాంధీనగర్.
**శ్రీసాయిరాం ప్రింటర్స్**
కవాడిగూడ, సికింద్రాబాదు.

ముఖచిత్ర ముద్రణ
**అనురాధ గ్రాఫిక్స్**
సికింద్రాబాదు.

**వెల : 50 రూ.**

ప్రతులకు
**విశ్వసాహితి**
కవాడి గూడ, సికింద్రాబాదు.

**విశాలాంధ్ర ప్రచురణలు**
బ్యాంక్‌స్ట్రీట్, హైదరాబాదు.

**మంత్రిప్రగడ శేషాబాయి**
ఎ-186, ఎడబ్లియు హెచ్.ఓ. కాలనీ, సికింద్రాబాదు - 500 009.

# తొలిపలుకు

గడచిన శతాబ్దంలో, పాశ్చాత్య భాషా సాహిత్యాల ప్రభావంతో తెలుగులో ఉద్భవించిన తెలుగు కథానిక క్రమ క్రమంగా "ఇంతింతై వటుడింతయై" అన్నట్లుగా చాలా విస్తృతిని, విఖ్యాతిని పొందింది. 20వ శతాబ్దం రెండు, మూడు నాలుగు భాగాల్లో ఆధునిక తెలుగు సాహిత్యంలో చిన్న కథకే ప్రధాన పాత్ర లభించింది. ఒక్కొక్క పత్రికలో ప్రతివారం నాలుగైదు కథలు ప్రచురితమయ్యేవి. దినపత్రికలు కూడ తమ వారాంతపు సంచికల్లో ఒకటో రెండో కథలు ప్రచురించడం విధిగా పెట్టుకొన్నాయి. ఈవిధంగా చిన్నకథకు ప్రచురణావకాశాలు విరివిగా లభించడం చేత, రచయితలకు రచయిత్రులకు కథమీద ఆసక్తి కలిగింది. కారణం కథల పాఠకుల సంఖ్య కూడ గణనీయంగా ఉండడమే. 20-25 సంవత్సరాల క్రిందట పరిస్థితి ఎట్లా ఉండేదంటే, 'కథకులు కాని రచయితలు, కవులు కూడ తెలుగులో ఉన్నారా?' ' అనే సందేహం కలిగేది. ఎందుచేతనో కాని ఇపుడు కథలు అంతవిరివిగా వ్రాసేవారు, చదివేవారు లేకుండా పోయినారు. అయినా ఒక పరిమితిలో కథానికారచన జరుగుతూనే ఉన్నవి. చదివేవారు చదువుతూనే ఉన్నారు.

ఇంక కథలోని వస్తువును చూస్తే, సర్వ ప్రపంచం దానిలో కనిపిస్తుంది. ప్రేమలు, పెళ్లిళ్లు, సంసారాలు, సంసారభంగాలు, అన్నదమ్ములు, తల్లిదండ్రులు, రైళ్లు, విమానాలు, దేశాలు, విదేశాలు ఒకటేమిటి? అందుకే సర్వప్రపంచం అన్నాను. బహుశా, ఇంతటి వస్తువిస్తృతి సాహిత్య ప్రక్రియల్లో మరొకదానికి లేదేమో!

కథలు వ్రాసేవారి సంఖ్య ఇపుడు తగ్గిపోయినా, పూర్వం వ్రాసినవారు కొందరు క్రొత్తగా ఆ విభాగాన్ని చపట్టినవారు కొందరు ఆ రంగంలో పనిచేస్తూనే ఉన్నారు. అట్లా చాలాకాలంగా కథలను వ్రాస్తున్నవారిలో మంత్రిప్రగడ శేషాబాయిగారి గురించి చెప్పవలె. నాకు తెలిసినంతవరకు వారు దాదాపు పాతిక సంవత్సరాలనుంచీ కథానికారంగంలో కృషిచేస్తున్నారు. మంచి కథలే వ్రాసి పాఠకుల మన్ననలను పొందినారు. ఇపుడు వారు ప్రచురిస్తున్న సంపుటిలో నాకు పదునారుకథలు కనిపించినాయి. ఏకథకాకథే ప్రత్యేకతను సంతరించుకొన్నట్లుగా కనిపిస్తుంది.

రచయిత్రి శేషాబాయిగారు ఉమ్మడి కుటుంబ వాతావరణంలో పెరిగినవారుగా కనిపిస్తారు. అటువంటి కుటుంబాల్లో, సౌకర్యాలతో బాటు, బాధలు కూడా చాలానే ఉంటాయి. ఈ రెండింటిలో ఏది మంచిది? అనే చర్చ వదలివేస్తే, వాటిని హృద్యంగా పాఠకులకు సమర్పించడంలో మంచి నేర్పు ఉన్న దీర రచయిత్రికి ఉమ్మడి కుటుంబాల్లో

కొన్ని పద్ధతులుంటాయి". ఒక మనిషి గురించి ఇంట్లో వాళ్లకి ఒక అభిప్రాయం కలిగిందంటే, అది మారదు, సరికదా, వాళ్లా విషయమే పదేపదే అంటుంటారు" ఇటువంటి చిన్న విషయాలు క్రొత్తగా అత్తవారింటికి వచ్చిన శారదకు చిన్న చిన్న సమస్యలు తెచ్చిపెట్టినాయి. ఇటువంటి సమస్యలు తీరడం కూడ కష్టమే. సున్నితమైన మనస్సును కష్టపెడతాయి. అప్పుడప్పుడు శారదకి కోపం, రోషం ముందుకొస్తాయి. దుఖంతో గద్గదమౌతుంది. కాని లేని నవ్వు తెచ్చుకుని ఆ కుటుంబంలో మెలగడమే ఆమె పని. ఉమ్మడి కుటుంబాలను చూపించే మంచికథ "మంత్రిప్రగడవారమ్మాయి".

వీరేశలింగం పంతులు గారి వంటి సంఘసంస్కర్తలు పూనుకొన్న కారణంగా, ఇపుడు మన సమాజంలో, బాల్య వివాహాలు, బాలవితంతువులు అనే సమస్యలు దాదాపు అదృశ్యమైనవనే చెప్పాలి. కాని, భార్యలను కోల్పోయిన భర్తల్లాగా, భర్తలను కోల్పోయిన వనితలు అక్కడక్కడ మనకు దర్శనమిస్తారు. వారి సమస్యలు సంతానం వలన ఏర్పడితే వాటిని పరిష్కరించుకోవలసిన అవసరం ఏర్పడుతుంది. కాని భర్తలను కోల్పోయిన సంతానవతియైన స్త్రీ పట్ల, మన సమాజం ఇంకా ఉదారంగా ప్రవర్తించడం నేర్చుకోలేదు. సంకుచిత భావం పోనేలేదు. అటువంటి సమయంలో కుటుంబంలోని వ్యక్తులే ఈసమస్యలకు పరిష్కారం వెతుక్కోవలసి వస్తున్నది. ఇటువంటి ఒక సమస్యను చూచి శేషాబాయిగారు అమ్మకోసం అనే కథను వ్రాసినారు. అమ్మకు మహా ఉంటే ముప్పైఅయిదేళ్ళుంటాయి. చిన్నతనంలోనే వివాహం అయింది. పదమూడేళ్ళకే మురళి పుట్టాడు. పోలీసు ఇన్స్పెక్టరుగా పనిచేసే మురళి తండ్రి, జీపు ప్రమాదంలో చనిపోయాడు. పుట్టింటికి చేరిన శ్యామలకి భర్త వియోగ దుఃఖాన్ని కూడ తెలుసుకోలేని వయస్సు. ఈఅమ్మాయి కథను, ఆమె సోదరుడు సహకరించినాడు. చదువు చెప్పించినాడు. ఉద్యోగంలో చేర్పించినాడు. కొడుకు మురళికి విద్యాబుద్ధులు చెప్పించినాడు. ఆఫీసరు ట్రైనింగు పూర్తి అయింది. స్వతంత్రంగా అలోచించే తెలివి వచ్చింది. అటువంటి సమయంలో, మురళికి మామయ్య జాబు వచ్చింది. మీఅమ్మ, సీతాపతి వివాహం చేసుకోవాలని అనుకొంటున్నారు. మీ అమ్మ సంగతి, నీకు బాగా తెలుసు! నీకు ఇష్టంలేని పని, మాకు ఇష్టం ఉండదు. కాబట్టి నీవు బాగా ఆలోచించి, మీ అమ్మకు కాని, నాకు కాని జవాబు వ్రాయి ఆ యువకుడు ఈ జాబు చదివి, ఎటువంటి ఎమోషన్‌కు లోను అయినాడు? ఎటువంటి నిర్ణయం తీసుకొన్నాడు? సమస్య పరిష్కారం అయిందా? ఎక్కడ వేసిన గొంగళి అక్కడే ఉన్నదా? ఆ కథ చదివితే కాని మనకు తెలియదు.

శ్యామలకు ఓ అక్క ఉండేది. కొంతకాలం ఆ అక్క, తనకూతురు చిట్టిని తల్లిదండ్రుల వద్ద వదలినది. ఆ పిల్ల కాలక్రమంగా శ్యామల పిన్నికి చేరువ అయింది. చిట్టియే ప్రపంచం అయి కూర్చుంది, శ్యామలకు. కాని ఒక ప్రభాత సమయంలో, శ్యామల అక్క, బావ వచ్చి తమ చిట్టిని తాము తీసికొని వెళ్ళి పోయినారు. ఇక చూడండి కథ. శ్యామల ఇంట్లో భోజనం చేయదు. ఆఫీసులో పనిచేయదు. బస్సులో నుంచి గమ్యస్థానం వచ్చినా దిగదు. ఇంటికి వచ్చిన శ్యామలను చూస్తే జ్వరం వచ్చినట్టుగా తెలిసింది. చేతులూ, కాళ్లూ వేలాడిపోతున్నై డాక్టరు వచ్చి మందులిచ్చినా నయం కాలేదు, సరికదా మూర్ఛావస్థలోకి వెళ్ళి పోయింది. తల్లికి, తండ్రికి, మనస్సులో మనస్సులేదు. ఏంచేయాలె? అని ఆలోచిస్తుండగా శ్యామలకు అమ్మ ప్రక్కన కళ్లనీళ్ళతో ఉన్న అక్క కనిపించింది. శ్యామల, "చిట్టి ఏది? " అని ప్రశ్నిస్తే, ఇదిగో! నీలాగే జ్వరం. శ్యాంపిన్నీ! అని రాత్రంతా కలవరిస్తూనే ఉంది! " అని అందించారామెకు. చిట్టీ, శ్యాం ఒకటయ్యారు. కథ ఎట్లా కంచికి వెళ్లిందో మనకు తెలియవస్తుంది. కౌటుంబిక కథల్లో చెప్పుకోదగింది మమకారం అనే ఈ కథ

గడచిన 30-40 సంవత్సరాలుగా మనదేశంలో మధ్యతరగతి లోని వనితలు విద్యావంతులు కావడం వల్ల నేమి, అవసరం రావడం వల్లనేమి, గడపదాటి, ఆఫీసులో చేరినప్పటి నుంచి, తనకు పనిని అవగాహన చేసుకోవడంలో మూర్తిగారు సహకారం చేస్తున్నారు. తనకేమైనా సందేహం వస్తే ఆయనను అడిగి తెలుసుకొంటుంది. వారి సంబంధాలు కొలీగ్స్ మధ్యలో ఉండడమే పరిధి. ఇట్లా ఉంటే, ఒకనాడు సెక్షన్ గిరిజతో, "ఆ సత్యనారాయణ మూర్తితో జాగ్రత్తగా ఉండాలమ్మా! అతను ఆఫీసరు మేనల్లుడు!" అని హెచ్చరించాడు. అంటే వారి సాన్నిహిత్యాన్ని, అపార్థం, చేసుకున్నాడన్నమాట. దీనితో వాతావరణం కలుషితం అయ్యే ప్రమాదం ఉన్నది. గిరిజ ఎట్లా ధైర్యం వహించిందీ, ఆ సమస్యను ఎట్లా ఎదుర్కొన్నదీ, 'సుడిగాలి' అనే కథలో రచయిత్రి చక్కగా చిత్రించారు.

ఉద్యోగుల చేసే పురుషుల్లో, హోదాను బట్టి తమ తమ బేధాలు. పాటించే విధంగానే, వనితలు కూడ తమ ఉద్యోగ హోదాను గొప్పదిగా భావించి గర్వపడేవారుంటారట. ఫెయిర్ సెక్స్‌లో ఈ గర్వం మరింత అధికంగా ఉంటుందేమోనని, భావించారు శేషాబాయి గారు. గిరిజాకుమారికి తాను బాగా చదువుకొన్నానని, పెద్ద ఉద్యోగం ఉందనీ రవంత గర్వం ఉన్నది. దాన్ని తనదాకా పరిమితం చేసికుంటే బాగానే ఉండేది. కాని తనకు చిరకాలంగా పరిచయం ఉండే, శాంతమీద ఆ గర్వాన్ని ప్రదర్శించింది. ఆమెను కొంచెం కించపరచింది కూడ. కాని శాంత చిన్నఉద్యోగం చేసినా, ఆమెకు ఇంకొక విధమైన టాలెంటు ఉన్నదని గిరిజకు తెలియరాలేదు. జనం ఆమె టాలెంటు గుర్తించి, ఆమెకు బ్రహ్మరథం పట్టేటప్పటికి,

ఎవరికి చిన్నతనమైందీ, ఎవరి గొప్పతనం వ్యక్తమైంది పశ్చాత్తాపం ఎదుటివారిని చిన్నతనం చేయడం పనికి రాదనే నీతిని కూడ బోధిస్తుందీ కథ. రచయిత్రులకు, నీతిబోధ చేసే హక్కును మనం కాదనగలమా!

ఈ కథా సంపుటిలో, ప్రేమ, విషాదం, హాస్యం, సామాజిక వాతావరణం మొదలైన వాటిని వ్యక్తం చేసే మంచికథలు ఉన్నాయి. శేషాబాయిగారు, తమ జీవితంలో తాము చూసిన ప్రపంచాన్ని, తమ కథల్లో మనకు చూపించినారు. ఈ ప్రపంచంలో మనం కొద్దిసేపు హాయిగా తిరుగవచ్చు. ఈ రమ్యమైన కథలు చదివినప్పుడు. సెలవు.

ఎం. కులశేఖరరావు

10-3, విజ్ఞానపురి,
విద్యానగరం,
హైదరాబాదు - 500 007.
27-8-2002.

# శేషాబాయి కథలు ఓ విశేషమే!

కథలు వ్రాయడం సులువని చాలామంది అనుకుంటారు. కాని అది నిజం కాదు జీవితంలో ఏ చిన్న సంఘటనైనా తీసుకుని కథ వ్రాయవచ్చు. ఎటువంటి పాత్రనైనా ఆధారం చేసుకుని కథ వ్రాయవచ్చు. అయితే రచయితకు సునిశిత పరిశీలన అవసరం. శేషాబాయి కథలు చదువుతూంటే యీ లక్షణాలన్నీ వున్నాయనిపిస్తుంది.

సహజ చిత్రణ నేడు కథల్లో ఒక ఆకర్షణ. పౌరాణిక కథలకంటే, సామాజిక సహజకథలు అందరినీ ఆకర్షిస్తాయి. ఆ విధంగా శేషాబాయి సమాజంలో సంసార సంఘటనలు ఆధారంగా మమతల పందిరి అల్లి మంచికథలు వ్రాశారు.

శేషాబాయి వ్యక్తిగతంగా సునిశిత హాస్యం పండించే చమత్కారి. నేను సంకలనం చేసిన 'సరదాగా నవ్వండి' లో అనేక ఛలోక్తులు సేకరించి యిచ్చారు. పాత్రల సంభాషణల్లో, సంఘటనల్లో సునిశిత హాస్యం ఆమె చాలా ప్రావీణ్యంతో పండిస్తుంది. 'పేర్రాజు - ప్రేమ కందూతి' లో హాస్యం వాతావరణం అంతా నిండి పోతుంది. పాఠకుడు చివరికి వచ్చేసరికి.

పెద్ద కథలూ వ్రాయవచ్చు. మరీ పెద్ద కథైతే చిన్న నవల రూపం పొందుతుంది. కాని కథానిక లక్షణాలు శేషాబాయి తు.చ. తప్పకుండా తమ కథల్లో ప్రతిబింబించారు. చిన్నకథలు బిజీ పౌరులకు చాలా ప్రయోజనకరం. అలసట, బాధల మధ్య కాస్త హాయిగా గాలి పీల్చుకుని ఒక మందస్మితం శేషాబాయి కథలు మనకు అందిస్తాయి.

సమాజాన్ని, పాత్రలను, సంఘటనలను, వారిలో అణిగివున్న మమతలను చక్కగా విశ్లేషించే నేర్పు శేషాబాయి ప్రస్ఫుటంచేసింది యీ కథల్లో.

నవలా రచయిత్రులు ఈనాడు తెలుగు కవులు చాలామంది ఉన్నారు. కాని చక్కని కథలు వ్రాయగలిగే రచయితలు చాలా కొద్దిమందే వారి కోవలోకి శేషాబాయి చేరుతుంది. అంటే అతిశయోక్తి కాదు.

ఈ కథలన్నీ వివిధ పత్రికలలో ఇదివరకే ప్రచురించబడి ప్రశంసలందుకున్నాయి. ఇప్పుడు యీ కథలు సంపుటిగా రావడంతో శేషాబాయి సంపూర్ణ రచనా వ్యక్తిత్వం ద్యోతకమౌతోంది.

శేషాబాయికి నా హృదయపూర్వక అభినందనలు. ఈ కథా సంపుటి పాఠకలోకాన్ని ఆనందంతో ఉర్రూతలూగించగలదని నా విశ్వాసం.

తేది: 25-9-2002

కళాప్రపూర్ణ
డా. పోతుకూచి సాంబశివరావు
కేంద్ర సాహిత్య అకాడమీ సభ్యులు
1-3-1-18, కవాడిగూడ, సికింద్రాబాదు - 80. ఫోన్: 7533177

# నామాట

నాకు పుస్తకం చదవడం అంటే చాలా ఇష్టం. అందులో కథలంటే మరీ ఇష్టంగా చదివే అలవాటు. దానికి తోడు ఇంట్లో అందరికీ పఠనాసక్తి ఉన్నది. గనుక మంచి పుస్తకం చదివితే, అందులోని విషయం అందరితో పంచుకోవడం అలవాటయింది. ఒకప్పుడు పిల్లలు అన్నాలు తినేటప్పుడు, పడుకోబోయేముందు పెద్దవాళ్లు కథలు చెప్పేవారు. మా బామ్మగారు ప్రతిరోజూ రాత్రి కథలు చెప్పేవారు మాకోసం కొత్త పుస్తకాలు చదివి ఆసక్తికరంగా చెప్పేవారు. కొన్ని పాడి వినిపించేవారు. వాటిలో ఎక్కువ హాస్యం, అద్భుతం కలిగించే విషయాలు ఉండేవి. తెలుగు చదవడం రాగానే ఆ పుస్తకాలు మేమే చదువుకునేవారం. నాన్నగారు జీవిత చరిత్రలు చదవమంటే అమ్మ కథలు, నవలలు చదవని ప్రోత్సహించేది. ఏదీ చదవద్దని ఎప్పుడూ ఆంక్షపెట్టలేదు. ఏ కాగితం ముక్క కనబడినా చదవడం అలవాటయింది.

స్కూల్లో, కాలేజీలో ఏపోటీ జరిగినా పాల్గొనాలనీ కొత్త విషయం చెప్పాలనీ ఆసక్తి కలిగింది. పోటీలు పడి పుస్తకాలు చదివేవాళ్లం. ఇంటరయాక కొన్నాళ్ళు ఖాళీగా ఉండాల్సివచ్చింది. అప్పుడు ఇంగ్లీషు, తమిళం, తెలుగు చాలా పుస్తకాలు చదివేదాన్ని. మాలతీ చందూర్ ఆంధ్రప్రభలో నిర్వహించిన ప్రమదావనానికి ఉత్తరం రాసి, నాపేరు అచ్చులో చూసుకుంటే చాలా సంతోషంగా ఉండేది. రాయాలన్న తపన అప్పుడే మొదలయింది. అప్పుడప్పుడు మా పిన్ని డా. సుభద్రమ్మ దగ్గర విజయవాడలో పెద్దాపురంలో ఉండేదాన్ని. ఆమె ఇంగ్లీషులో ప్రఖ్యాత రచయితల నవలలు, కథలు తను చదివి నాకు తెలుగులో చెప్పి, నాచేత చదివించేది. గ్రహించిన విషయం రాసి చూపించమనేది. “మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ” అంటారు పెద్దలు. ఆ మూడింటికి ప్రతిరూపం మా పిన్ని. ఏ విషయంలోనైనా, “నేనున్నాను!” అంటూ అండగా నిలిచేది మాపిన్నే. నా అభిమానాన్ని, ప్రేమను, వ్యక్తీకరించడానికే ఈ కథల పుస్తకం, మాపిన్నికే అంకితం ఇస్తున్నాను.

ఉద్యోగంలో చేరాక ప్రఖ్యాత రచయిత్రి డా. వాసిరెడ్డి సీతాదేవిగారితో పరిచయం కలిగింది. నా సాహిత్యాభిలాషను గుర్తించి, మొట్టమొదట నాచేత కలం పట్టించి, గల్పిక, రాయించింది సోదరి వాసిరెడ్డి సీతాదేవి గారే! నాటినుండి, నేటివరకూ, ఆమె ప్రోత్సాహం, అండదండలు నాకు ఉన్నాయని, గర్వంగా చెప్పుకుంటాను. ఆమే నన్ను నవ్యసాహితీ సమితికి పరిచయం చేశారు.

నవ్య సాహితీసమితి, విశ్వసాహితి సమావేశాలలో సభ్యులు తమ కొత్త రచనలు చదివి వినిపించేవారు. ప్రతీసారీ కొత్త కథో, గల్పికో రాసేదాన్ని. మునిమాణిక్యం నరసింహారావు గారి వంటి పెద్దలున్న సమావేశాలలో చదివినప్పుడూ, ప్రజాప్రభలో రావి శాస్త్రిగారి కథతోపాటు నా కథ ప్రచురింపబడినప్పుడూ, నేను పొందిన ఆనందం నా జీవితంలో మరువలేనిది. కొన్ని కథలు, ఆకాశవాణిలో (హైదరాబాదు కేంద్రం) ప్రసారం అయ్యాయి. మరి కొన్ని వివిధ పత్రికల్లో ప్రచురింపబడ్డాయి. ఈ సంకలనంలో పదహారు కథలున్నై. ఈ సంకలనానికి ఇందులోని ఒక కథ పేరే పెట్టాలనుకున్నాను. అదే "పేర్రాజు ప్రేమ కందూతి", ఆ కథకి నా తమ్ముడు డా. సీతారామ్ ముఖచిత్రం గీశాడు. మనుష్యుల గుండె జబ్బులను గుర్తించి, బాధా నివారణ మా సోదరుడు చిరంజీవి డా. సీతారామ్ వృత్తి. మనసున్న మనుష్యుల గుండెలకి గాయాలు కాకుండా చూడడం అతని ప్రవృత్తి. అడుగడుగునా నన్ను ప్రోత్సహిస్తూ, నా ఆరోగ్యం కాపాడుతున్న నా చెల్లెలు డా. కేతరాజు సరోజినీదేవికీ, తమ్ముడు డా. మంత్రిప్రగడ సీతారామ్‌కీ నా ఆశీస్సులు.

ఎన్ని పనులున్నా, నా కథలు చదివి, కొంత సమయం వినియోగించి, తొలిపలుకులు రాసిన మా గురువులు, సోదరులు ఆచార్య యం. కులశేఖర రావు గారికి, కృతజ్ఞతలు సమర్పించడానికి మాటలు చాలవు. అభిమానంతో రాసిన మాటలు నేను ఎప్పటికీ మరచిపోలేను.

ఈ కథలను సంకలనంగా వెలువరించాలని, సూచించి, ప్రోత్సహించి, బాధ్యత వహించి, కార్యరూపంలో ఆచరణలో పెట్టించినవారు విశ్వసాహితి అధ్యక్షులు గౌరవనీయులు డా. పోతుకూచి సాంబశివరావుగారు. నేను దాదాపు ఇరవై అయిదు సంవత్సరాలు విశ్వసాహితికి కార్యదర్శిగా పనిచేశాను. అన్ని కార్యక్రమాలలో పాల్గొన్నాను. 1963వ సంవత్సరం నుంచీ, నేటివరకూ ప్రోత్సహించి, సహాయం, సహకారం అందిస్తున్న ఆత్మీయులు, డా.పోతుకూచి సాంబశివరావు గారు.

విశ్వసాహితి తరపున పరిచయ వాక్యాలు రాసిన డా. పోతుకూచి సాంబశివరావు గారికి కృతజ్ఞతా పూర్వక నమస్కారాలు.

ఈ పుస్తకం అందంగా ప్రింటు చేసి ఇచ్చిన దత్తసాయి గ్రాఫిక్స్ వారికి, శ్రీ సాయిరాం ప్రింటింగ్ ప్రెస్ వారికీ కృతజ్ఞతలు.

సికింద్రాబాదు తేది: 25-9-2002

మంత్రిప్రగడ శేషాబాయి

| విషయ సూచిక | | పుట సంఖ్య |
|---|---|---|
| 1. | స్వగతం | 01 |
| 2. | మారినది మనుషులా కాలమా | 03 |
| 3. | మంత్రిప్రగడవారమ్మాయి | 08 |
| 4. | పేర్రాజు - ప్రేమ కండూతి | 12 |
| 5. | అమ్మకోసం | 16 |
| 6. | మమకారం | 20 |
| 7. | నీతి నిలిపిన జెండా | 27 |
| 8. | సుడిగాలి | 36 |
| 9. | కంపుగొట్టె | 41 |
| 10. | ఎదురుతిరిగిన ప్రేమ | 42 |
| 11. | పశ్చాత్తాపం | 47 |
| 12. | ముక్కు చిక్కు | 53 |
| 13. | బాధ్యత | 55 |
| 14. | తామ్రపత్రం | 60 |
| 15. | ఆంతర్యం | 67 |
| 16. | కొత్తవెన్నెల | 75 |



---

**అంకితం :**

మమత నిండిన మనస్సుగల

మా పిన్ని

**డా. రాయవరపు సుభద్రమ్మగారికి**

ప్రేమతో

# శేషాబాయి

---

# స్వగతం

అబ్బా! ఏమిటి కుదుపు? రైలు పట్టాలు మారుతున్నట్లుంది. నా జీవితం కూడా ఒకవిధంగా పట్టాలు మారబోతోందనే చెప్పాలి. ఈ రోజునుంచి. ఆయన ఎంత విశ్రాంతంగా నిద్రపోతున్నారో! నిన్న కాక మొన్న వచ్చిన పిల్ల. కోడలు నిద్రపోతోందంటే అర్థం ఉంది. ఆ పిల్లకింకా కష్టసుఖాలు తెలియవు.

కష్టపడి కట్టించుకున్న ఇల్లు, పదేళ్లుగా ఉంటూ వచ్చిన ఇల్లు అమ్మేసి, ఆ కలకత్తాలో అద్దెకొంపలోఎలా ఉంటామో ఏమో! ఎంత వద్దనుకున్నా ఆ ఇంటిమీద భ్రమ పోదేం? ఆ కొత్తగా వచ్చినవాళ్లు క్లినిక్ పెట్టుకుంటారట. మొక్కలు ఏమయిపోతాయో? ఆ సన్నజాజి తీగె ఎంతకష్టపడి పెంచానో? ఇవాళనుంచి రాధాయికి, చిట్టికిపూలు ఎట్లా? ఈపాటికి వాళ్లిద్దరు అత్తగారింటికే వెళ్ళి పూలు తెచ్చుకొంటామని గొడవ చేస్తుంటారు! కాబోలు. వాళ్లమ్మ చెబుతుంది అత్తలేదని. పిల్లలు వాళ్ల కేం తెలుసు? వదినెలు మఱదలు "మాఆడబిడ్డగారిల్లు అమ్మేసుకుని కలకత్తా వాళ్లబ్బాయితో వెళ్లిపోయారండీ!" అంటారు కాబోలు! అయినా నా ఖర్మం కాక మరేమిటి? ఈయనకి ఈ ఆలోచన ఎట్లావచ్చిందో? రిటైరయి హాయిగా కాలుమీద కాలు వేసుకుని స్వంత ఇంట్లో ఉంటున్నాం. అల్లుళ్లు కూతుళ్లు అబ్బాయి పెళ్లికి వచ్చినప్పుడు ఇల్లెంత నిండుగా ఉంది? మనవలు, మనవరాళ్లు "అమ్మమ్మా! ఆ చెట్టు పువ్వు పూసింది. ఈ చెట్టు కాయ కాసింది" అని ఇంట్లో తిరుగుతూ ఉంటే ఎంత గర్వపడ్డాను? ఏ పాపిష్టికళ్లు పడ్డాయో? అయినా ఎవర్నో అనుకోవడమేం? అసలు మనిషికి లేకపోయాక, కాకినాడలో స్థలం కొని మళ్లీ కొత్తరకంగా కడతారట! డబ్బయితే ఉందిగాని ఇదివరకులాగ దగ్గర నిలబడి కట్టించడానికి ఓపిక ఉందా, ఏమన్నానా! అయినా నా కెందుకు? పెద్దల్లుడు వద్దని చెబితే ఎగిరిపడ్డారు. నేను చెబితే ఈ ఊళ్లో అన్నదమ్ముల అండచూసుకుని నాకే చెబుతున్నావన్నారు. అయినా చిన్నపిల్లల్లాగ అల్లుళ్లముందు పోట్లాటలేమిటని ఊరుకోవలసి వచ్చింది. ఇంక అబ్బాయి. వాడేమంటాడు? "నాకెందుకమ్మా? నాకెక్కడ ఉద్యోగం అయితే అక్కడే ఉంటాము. మీరూ నాగ్గరే ఉందురుగాని. ఏ అక్కయ్యకి చూడాల్నుంటే అది అక్కడికే వస్తుంది అంటాడు.

ఆ కలకత్తాలో వందరూపాయలిచ్చినా శుభ్రమయిన ఇల్లు దొరుకుతుందా? దొరికినా సొంత ఇంటికి సాటి వస్తుందా? ఇంతకీ నా రాత! నా ఈడు వాళ్లు సొంత ఇళ్లలో ఉంటున్నారు. ఇల్లు లేనివాళ్లు లేదో అని ఏడుస్తూ ఉంటే ఉన్న ఇల్లే చవగ్గా అమ్మేసి వెళ్లిపోతున్నాం.

సమయానికి చిన్నన్నయ్య కూడా ఊళ్లో లేడు. ఉంటే ఇలా జరగనిచ్చేవాడు కాదేమో! ఏమో బాబు! చిన్నప్పటినుంచి ఈ మనిషి ఎలా చెబితే అలా చేసి ఇన్నేళ్ళూ గడిపాను. ఆఖరికి అబ్బాయి పెళ్లి విషయంలో కూడా నన్ను నోరెత్తనివ్వలేదు. పోనిలే! వాళ్లేనా సుఖపడతారు. ఏ విషయంలోనూ ఆయన మాటకి ఎదురు చెప్పలేదు. ఈ విషయంలో ఎదురు చెప్పానని "మీ అక్కయ్య ఇలాచేసింది" అంటూ రామం దగ్గఱ తిట్టిపోశారుట. పాపం, వాడి మనస్సెంత బాధపడిందో నన్ను తిడుతున్నారని.

ఆ కరివేపాకు ఇక వీధంతా కోసుకుపోతారు కాబోలు! గేటు సరిగ్గా వేశారో లేదో! ఆ ఇల్లు అమ్మేసి "మనది కాదు" అనుకుని వచ్చేసినా నా మనస్సేమిటో ఆ ఇంటి చుట్టూనే తిరుగుతూంది. పెద్దన్నయ్య ఎప్పుడూ అనేవాడు, "ఋణానుబంధ రూపేణ పశు పత్నీ సుతాలయః" అని. అంతా నిన్న మొన్నట్లా ఉంది. అప్పుడే పెద్దన్నయ్య పోయి పదేళ్లయింది. ఆయన కంత వైరాగ్యం ఎలా వచ్చిందో! కాపురానికి వెళ్లిన కూతురు పోయినప్పుడు కూడా ఆయన దుఃఖం పైకి కనపడనీయలేదు. "దానికదృష్టం లేదర్రా, ఇంతమంది మధ్య ముద్దుముచ్చట్లనుభవించడానికి" అనేవాడు. లోపలెంత కుమిలేవాడో? నిజమే! ఆ ఇంటితో ఋణంతీరిపోయింది. ఎక్కడుంటే అదే ఇల్లు. మనుషులు కూడా అంతేగా; ఈ భూమ్మీద ఋణం తీరితే క్షణం ఉండరు. ఎవరు చేరవలసిన స్టేషను రాగానే వారు రైలు దిగి పోయినట్లు వారికాలం తీరగానే రాలిపోతారు. పోనీలే, వారు నాలుగు కాలాలపాటు చల్లగా ఉంటే అదే చాలు. ఇక పిల్లల సంగతా? ఎవరిమట్టుకు వాళ్లు చూసుకో గలరు. వాళ్లకి ఏలోటూ లేదు. అరే! అప్పుడే హౌరాస్టేషను వచ్చేసినట్లుందే!.

-:o o o:-

# మారినది మనుషులా కాలమా

అర్ధరాత్రయినా శ్యామసుందరికి నిద్రపట్టలేదు. నెమ్మదిగా దోమతెఅ పైకి ఎత్తి పక్కనే ఉయ్యాలలో పడుకున్న రమను చూసింది. రమ నిద్రలో నవ్వుతున్నది. శ్యామ తిరిగి మంచం మీద పడుకుని నిద్రపోవటానికి ప్రయత్నించింది. నిద్ర పడితేగా? అమె మనస్సంతా భర్త మీదే ఉంది. ఈపాటికి రైల్లో కిటికీదగ్గర కూర్చుని వెన్నెలలోకి చూస్తువుంటాడని అనుకుంది.మళ్లా పక్క మీదనుంచి లేచి పెద్దలైటు వేసి పుస్తకం తీసి చదవాలని ప్రయత్నించింది. టేబిలుమీద భర్తా. తానూ తీయించుకున్న ఫోటోవుంది. మూర్తి గంభీరంగా వున్నాడు. తాను చిలిపిగా నవ్వుతున్నది. ఆ ప్రయత్నంగా శ్యామ దృష్టి గోడకి తగిలించిన అత్తమామల ఫోటో మీదపడి నవ్వొచ్చింది. అత్తగారు పేరుకు తగ్గట్టు మహలక్ష్మిలా కూర్చున్నారు. పక్కనే మామగారు హాఫ్‌చేతుల తెల్లచొక్కా, గూడకట్టు పంచ, చేతులో జేబురుమాలు పట్టుకు నించున్నారు. అది వారి మొదట ఫోటోట! ఇద్దరికీ ముప్పైఐదేళ్ల లోపే ఉండవచ్చు. వయస్సు మధ్యన మూర్తి నిల్చున్నాడు.

శ్యామ లేచి మెల్లగా బాల్కనీలోకి వెళ్లి నిల్చున్నది. వెన్నెల తెల్లగా అకాశం మీదనుంచి ఇళ్లమీదికి, చెట్లమీదికి, అక్కడినుంచి భూమ్మీదికి పాకుతున్నట్లనిపించింది. మళ్ళీ శ్యామకు మూర్తి జ్ఞాపకం వచ్చాడు. మామగారు కేశవయ్య గారు రైల్లో హాయిగా నిద్రపోతూవుంటారు. ఆయన నిశ్చలత, నిశ్చింత శ్యామకు ఆశ్చర్యంగా ఉంటాయి. మూర్తి డాక్టరు. మిలిటరీలో చేరాడు. సెలక్టయాక నీఫా వెళ్లమని ఆర్డర్లు వచ్చాయి. ఆరోజు సాయంత్రమే బయలుదేరి వెళ్లాడు. మామగారుకూడా ఢిల్లీ వరకూ వెళ్లారు. ఆయన చిన్నప్పుడు రెండో ప్రపంచ యుద్ధంలోకి వెళ్ళివచ్చారుట, కాని ఆయన ఆ సంగతులు ఎప్పుడూ మాట్లాడరు.

శ్యామకు హాల్లోమామగారి మిలిటరీ స్నేహితులతో తీయించుకున్న ఫోటో జ్ఞాపకం వచ్చింది. అప్పుడప్పుడు తంజావూర్నించి వచ్చే మామగారి స్నేహితుడు షెర్ఫుదీన్ తెలుసు. మామగారు, అతను "ఏరా" అనుకోవటం విని అశ్చర్యపడింది. ఎంతో ఆచారంగలవారిలా కనిపించే అత్తగారు కూడా షెర్ఫుద్దీను అన్నగారిలా గౌరవించటం శ్యామకు సంతోషంగా ఉండేది.

అత్త మామల సంస్కారానికి సహృదయతకీ పొంగిపోతుంది. షెర్ఫుద్దీన్ శ్యామను ఆప్యాయంగా వచ్చీరాని తెలుగులో "ఏవమ్మా బాగున్నారా?" అని పలకరించేవాడు. ఆయనవస్తే ఇల్లంతా మాటలతో నవ్వులతో ఎగరగొట్టేవాడు. అంతా తమిళంలో మాట్లాడుకునేవారు. అత్తగారికి ఉరుదు రాదు. ఆయనకి తెలుగు సరిగా రాదు. దక్షిణాదిన ఉండటం వల్ల అత్తగారికి తమిళం బాగా వచ్చును. శ్యామకు తమిళం రాదు. మాట్లాడుతూవుంటే వింటూ కూర్చునేది. రమ పుట్టిన తరువాత ఐదోనెల రాగానే శ్యామ పుట్టింటినుంచి వచ్చిన రెండోరోజే ఏదోపని మీద షెర్ఫుద్దీన్ వచ్చేడు. రాగానే మూర్తిని "ఎంగెడా పేర కుషంధై?" అంటే పక్కనే ఉన్న శ్యామ పాపపేరు అడుగు తున్నారనుకొని గబుక్కున 'రమ' అన్నది. అంతానవ్వారు మూర్తి 'అదికాదు శ్యామ! మనుమరాలు ఎక్కడ?' అంటున్నారని వివరించాడు ఎప్పుడు ఎక్కువగా నవ్వని మామగారుకూడ పకపకా నవ్వారు. తను సిగ్గుపడింది. ఎందుకో ఇవన్నీ ఆలోచిస్తున్నాని అనుకుంటూ కాలిమట్టెల చప్పుడు విని వెనక్కి తిరిగి చూసింది.

అత్తగారు శ్యామ బుజంమీద చెయ్యివేసి "నిద్రపట్టలేదా? శ్యామా! రా! లోపలికి పోదాం! మంచుపడుతోంది, జలుబు చేస్తుంది" అంటూ గదిలోకి తీసుకువెళ్లింది. ఆవిడ తన దిండ్లవీ తెచ్చుకొని, శ్యామ గదిలోనే పడుకున్నది. శ్యామకూడ లైటార్పి పడుకుంది. కాని నిద్రపట్టే అవకాశం లేదనుకుని లేచింది. అత్తగారుకూడా తనలాగే నిద్రపట్టక దొర్లుతున్నదని గ్రహించి శ్యామ అత్తగారి పక్కలో కూర్చుంది. మెల్లగా 'అత్తయ్యా!' అంది. అమె మెల్లగా శ్యామ బుజం తడుతూ "ఈ పాటికి రైలు నాగపూరు దాటి వుంటుంది. మీ మామగారు నిద్రపోతూ వుంటారు. మూర్తి నిద్రపట్టక మనల్ని తల్చుకుంటూ కూర్చుని వుంటాడు" అన్నది. ఆ మాటలు విని ఆశ్చర్యపడింది శ్యామ.

అత్తగారు "శ్యామా! మీ మామగారు మిలిటరీలో చేరినప్పుడు నాకు పదిహేను సంవత్సరాలు ఉంటాయేమో! నా మనస్సు అర్థం చేసుకునేవాళ్ళేలేరు. ఆయన మిలిటరీలో ఉన్నప్పుడు అత్తవారింట్లోనే వుండేదాన్ని. నా పెళ్లినాటికే అత్తగారు పోయారు. తోటి కోడలికి పిల్లలు. రోగిష్టి ఆడబిడ్డలు వస్తూపోతూ వుండేవారు. అందువల్ల నన్ను తరచు పుట్టింటికి పంపేవారుకారు. మా వాళ్లుకూడా ఆడపిల్ల అత్తవారింట్లోనే ఉండాలనేవారు. మామగారికి మహాకోపం, వీరందరికీ చాకిరీ చేసేదాన్ని కాని నా అతీగతీ ఎవరూ కనుక్కునేవారు కాదు. నేను ఉత్త పిరికిగా వుండేదాన్ని. నోట్లోంచి గట్టిగా మాటకూడా వచ్చేదికాదు.

పుట్టింట్లో తల్లిలేని పిల్లనని నాన్న గారం చేసేవారు. మేనత్తలూ మా చిన్నాన్నకూడా గారం చేశారు. కాని ప్రపంచజ్ఞానంగాని మరే విజ్ఞానంగాని లేకుండా పెంచారు. మా నాన్నకి నే నొక్కతెనే అవటంవల్ల చూసయినా గడుసుతనం నేర్చుకోటానికి అవకాశం లేదు. నేను 13వ ఏట అత్తవారింటికి వచ్చాను. తరువాత మా చిన్నాన్నకి పిల్లలు కలిగారు. మాది పల్లెటూరు. ఐదోక్లాసు పాసవగానే మానిపించి పెళ్లిచేశారు నాకు.

మీ మామగారు మిలిటరీలోవున్నా దేశంలో వుంటే అప్పుడప్పుడు ఇంటికి వచ్చేవారు. కొన్నాళ్లకు సింగపూర్ తీసుకెళ్తారని ఉత్తరం రాశారు. "ఊరికి రాకుండా పోయేవాడిని చూసేదేమిటి?" అన్నారు మామగారు. మా పల్లెటూరునుంచి రైలు స్టేషనుకి వెళ్లాలంటే ఆరుమైళ్ల దూరంలోవున్న పట్నం వెళ్ళాలి. ఒక్కసారి చూస్తే బాగుండుననిపించింది నాకు. కాని ఎవరికి చెప్పను? నా మాట వినేవాళ్లెవరు?" నాలో నేనే కుమిలిపోయాను. ఉత్తరం రాసినా వాళ్ల నాన్నకు రాసేవారు. ఆయనకిష్టమైతే ఏ పెద్దకొడుకుతోనో "కేశవుడుత్తరం రాశాడురా" అని చెప్తూంటే వినేదాన్ని. తరవాత బాంబులు, గొడవలతో దేశమంతా అల్లకల్లోలం అయిపోయింది. ఆ పల్లెల్లో చిలవలకి పలవలు చేర్చి చెప్పుకునేవారు. మూడు సంత్సరాలు ఆయన సంగతే తెలియదు. ఎలా రోజులు గడిపానో నాకే తెలియదు. మా మామగారు చాలా కఠినుడు. చిన్నకొడుకు ఎక్కడున్నాడో ఎలా వున్నాడో తెలియకపోయినా పెద్దకొడుకు, పిల్లలను, వ్యవహారాలు, వ్యవసాయం చూసుకుంటూ నిశ్చింతగా వుండేవారు.

తరువాత మూడు సంత్సరాలకి ఆయన జపాన్‌లో ఉన్నారని కబురు తెలిసింది. తరువాత మరో సంవత్సరానికి 'బాగానే వున్నాను' అని కార్డు వచ్చింది. తరువాత యుద్ధం అయిపోయింది. మరో రెండు సంవత్సరాలకి ఇంటికి తిరిగివచ్చారు. జపాన్‌లో వుండి వచ్చారని ఇదివరకు చేస్తున్న ఉద్యోగం కూడా ఇవ్వలేదు. ఊళ్లోనూ, ఇంటిచుట్టూ సి.ఐ.డి ఆఫీసర్లు కనిపెట్టి ఉండేవారట. ఆరు నెలలు ఉద్యోగంకోసం తిరిగాక తిరిగి ఇచ్చారు. పట్నానికి వచ్చేశాం. పల్లెటూళ్లో వ్యవసాయం బావగారికి అప్పగించి మామగారు మాతో పట్నం వచ్చేశారు. మీ మామగారికి అప్పుడూ నోరులేదు. ఏదీ పట్టించుకోరు. నాకు వక్కపలుకు కావాలన్నా ఆయన్నడగాలి. ఆయన వాళ్ల నాన్ననడిగి తేవాలి. నాకు అప్పుడు సంసారమన్నా బంధువులన్నా విరక్తి కలిగింది. అటు మావూర్నించి ఇటు వాళ్ల వూర్నించి ఎవరో ఒకరు పట్నం వచ్చిపోతూవుండేవారు. అందరికి ఆయన మిలిటరీనుంచి బోలెడు డబ్బు తెచ్చారని

అభిప్రాయం. "పిల్లల్లేరు కదా ఏం చేసుకుంటారు? అన్నట్టు మాట్లాడేవారు. నాకేడుపు వచ్చేది. ఈ వచ్చేపోయేవాళ్లకి వండిపెట్టి మరియాదలు చేసి మాటలు పడాల్సివచ్చిందని. ఎప్పుడన్నా మీ మామగారికి చెపితే ఏ ఆఫీసు కాగితమో, ఏ పుస్తకమో ముందేసుకొని నా మాట వినకుండానే 'అదంతేలే' అనేవారు. ఇక ఏంచెప్పను? చెప్పి ఏం లాభం?

తరువాత మీ మామగారికి పెద్దఉద్యోగం అయింది. దూరదూరంగా బదిలీలు అయేయి నాకు కొంచెం ధైర్యం వచ్చింది. ఒకరిద్దరు ఆఫీసర్ల కుటుంబాలతో పరిచయం అయి, స్నేహం గట్టిపడి, విడరాని బంధంగా తమారయింది కొందరితో. తరువాత పుట్టాడు మూర్తి. అప్పటికి మామగారు పోయారు. బాలసారెకి మావాళ్లు దూరమని రాలేదు. డబ్బు పంపి ఊరుకున్నారు. బావగారికి తోటికోడలికి భాగస్థుడు పుట్టాడని ఈర్ష్య వల్ల రాలేదు. ఆన మిలిటరీలో పనిచేసినప్పటి స్నేహితుడు. షెర్ఫుద్దీన్ కుటుంబంతోసహా వచ్చాడు తంజావూర్నించి. ఊళ్ళోనే పెద్దాఫీసరుగా ఉన్న వెంకట్రామయ్యగారూ, భార్యా ఆడబిడ్డని తీసికెళ్ళినట్లు వాళ్లింటికి తీసికెళ్ళి బాలసారె చేశారు. పీటలమీదికి, షెర్ఫుద్దీన్ మాకు బట్టలు, మేనల్లుడికి కట్నాలు తెచ్చాడు. మేము మనస్ఫూర్తిగా ఆ బట్టలేకట్టుకున్నాం. కొత్తలో షెర్ఫుద్దీన్ కుటుంబం మనింటికి వస్తే నాకు మహా ఎబ్బెరికంగా ఉండేది, తరువాత జాతి, మతం, కాదు ప్రధానం, మనస్సని తెలిసింది. మీ మామగారేదీ నోటితో చెప్పరమ్మా! చేసి మనం తెలుసుకొనేటట్టు చేస్తారు.

ఇదంతా నీకు ఎందుకు చెప్తున్నానో తెలుసా? నువ్విలా బెంగపెట్టుకొని కూచుంటావని బోర్డరు దాటి కాస్త వెనకగా ఏ వూరు వేసినా క్వార్టర్సు అవీ యిస్తారు. మనంకూడా వెళ్లిపోవచ్చు. నువ్వుమాత్రం మీవాళ్లింటికి అచ్చంగా వెళ్లిపోకు! మూర్తి దగ్గరలేని లోటు నాకెలాగా కనిపిస్తూనే వుంటుంది. నువ్వు, పాప కూడా దగ్గరలేకపోతే నేనుండలేను. ఇన్నాళ్లకి పాపవల్ల ఆడపిల్ల లేని లోటు తీరింది. ఎలాగా బి.ఏ, పాసయేవు దనుక బి.ఇడి గాని, ఎం.ఏ గాని చదవాలనుంటే చదువుకో! పాపను నేను చూచుకుంటాను. ఉద్యోగంలో చేరతానన్నా అభ్యంతరం లేదు. మీ మామగారుకూడా ఏమీ అనరు అంటూ కళ్లు తుడుచుకుంది.

మళ్లా "శ్యామా! శారదకు ఒక నెల సెలవుపెట్టి రమ్మని ఉత్తరం రాయిస్తాను. ఆ అమ్మాయివస్తే ఇట్టే కాలక్షేపం అవుతుంది. మీ మామగారి స్నేహితులు వెంకట్రామయ్యగారి అమ్మాయి మెద్రాసులో ఉద్యోగం చేస్తోంది. పెళ్లిలో చూసేవుంటావు. సెలవు లేదని త్వరగా

వెళ్లిపోయింది. నాకు ఆడపిల్లలేని లోటుతీర్చించి ఆ పిల్లే! మూర్తికి అక్కచెల్లెళ్ళు లేని లోటు ఆమెవల్లే తీరింది మూర్తిని వచ్చినపుడల్లా అల్లరిచెయ్యకుండా కొట్టి తిట్టి అదుపులో పెట్టేది. ఎంత కొట్టినా 'శారదక్క' అంటూ వెంటతీరిగేవాడు. మీ మామగారికి మూర్తికన్నా శారదంటేనే ప్రాణం. వీడు పుట్టకముందునుంచే దగ్గరకు తీశారు. ఇంత గంభీరమైన మనిషీ ఆ పిల్ల ప్రశ్నలకు, మాటలకు సమాధానం చెప్పలేక తికమకపడతారు. వాదాలేసుకొని రోజులు మర్చిపోతారు. మీ మామగార్ని లొంగతియ్యగలిగింది ఆ పిల్లే. ఇప్పటికే పాపనుచూడలేదని కొట్టుకుపోతూవుంటుంది. ఆ పిల్ల సెలవుదొరికి వచ్చిందంటే నీకు కాలక్షేపం అవుతుంది. ఇక పడుకో, అమ్మా! చాలా పొద్దుపోయింది" అంటూ ఒత్తిగిలి పడుకున్నది.

శ్యామసుందరి లేచి పాపకు సరిగా కప్పి, దోమతెర సరిచేసి పక్కమీదవెళ్లి పడుకుంది. అత్తగారి మాటలు, మామగారి సంగతులు ఆమెను ఉక్కిరిబిక్కిరి చేశాయి. సంతోషంతో కళ్ళనిండా నీళ్లు తిరిగాయి. "పాపం, ఆనాడు ఆమెను అర్థం చేసుకునేవాళ్లు, ఆదరించేవాళ్లూ లేరు, నాకేం లోటు? ఇంత అర్థంచేసుకునీ ఉద్యోగం చెయ్యమనీ ప్రోత్సాహించే అత్తగారుండగా! రేపే శారదకి ఉత్తరం రాయాలి. అమె దగ్గర్నుంచి ఉత్తరం వస్తే మామగారు మళ్లా మళ్లా చదువుకుంటారు సంతోషంగా."

"మారినది మనుషులా?కాలమా?" అని ఆలోచిస్తూ శ్యామ నిద్రపోయింది.

-:o o o:-

# మంత్రిప్రగడవారమ్మాయి

శారదా డాబామీద డౌరుగోడ పట్టుకుని నిల్చుని చూస్తోంది. అమె ఆయాసపడుతోంది. ఆవేశంగా వచ్చిందేమో నుదురు చెమటతో తడిసిపోయింది. నడుం దగ్గర దోపుకున్న పైటచెంగుతీసి ముఖం తుడుచుకున్నది. దూరంగా సిటీలో లైట్లు కనబడుతున్నాయి. కొన్నిచోట్ల గుంపులు గుంపులుగా నక్షత్రాల కుప్పలల్లె మెరుస్తున్నాయి. కొన్ని వరసగా తోరణాల్లా మెరుస్తున్నాయి. కొన్ని ఆరుతూ వెలుగుతూ పరిగెడుతున్నట్లున్నాయి. శారదకాదృశ్యం చూసేక మనస్సు కొంచెం స్థిమితపడింది. ఆమె ఇక్కడికి వచ్చినప్పటినుంచి రోజుకొకసారైనా రాత్రి డాబా ఎక్కి ఆ దృశ్యం చూస్తుంటుంది. దూరంగా రెండు ఎర్రలైట్లు కనిపించాయి శారదకి, ఆమె మనస్సు కలుక్కుమంది. ఈ నాటి సంఘటన తన జీవితానికి డేంజరులైటు కాదు కదా! అనుకుంటూ గడ్డంకింద చెయ్యి ఆన్చుకుని కూర్చుంది. అమె మనస్సులో 10 నిముషాల కిందటి సంఘటన గురించే అలోచిస్తోంది. తను చేసిన పని తప్పేనేమో! అయినా ఆ రోజు ఆవేశం పట్టలేక పోయింది.

శారద హైదరాబాదు అత్తవారింటికి వచ్చి ఆరు నెల్లయిందేమో! వచ్చీ రాగానే భర్తప్రోత్సాహంవల్ల ఉద్యోగంలో చేరింది. ఇంట్లో చూచుకోటానికి అత్తగారు ఉన్నారు. మామగారితో, భర్తతోపాటు ఆఫీసుకు బయలుదేరి వెళ్లటం శారదకి గర్వంగానే ఉండేది, పెద్దాడబిడ్డ టీచరు. చిన్నాడబిడ్డ పి.యు.సి. చదువుతున్నది. వాళ్లిద్దరూ ముందుగా బయలుదేరి వెళ్లి పోయేవారు. పేచీపూచీ లేని సంసారం. ఉదయం లేవగానే అంతా తలో పనీ చూసుకుని బయలుదేరివెళ్లటం. పొద్దుటిపూట లేటుగా బయలుదేరి వెళ్తుంది గనుక అన్ని పన్లూ ముగించి వెళ్లేది శారద. సాయంత్రం త్వరగా వచ్చేసి వంట మొదలుపెట్టేసేది పెద్దాడబిడ్డ. శారద వచ్చేక మిగతా పన్లకి సహాయం. చేసేది. సాయంత్రం అత్తగారిని వంటలోకి రానిచ్చేవారుకాదు.

శారదకి అత్తవారింట్లో ఒక పద్ధతి మాత్రం కష్టంగా ఉండేది. ఒక మనిషి గురించి ఆ ఇంట్లో వాళ్లకి ఒక అభిప్రాయం కలిగిందంటే అది మారదు సరికదా, వాళ్లా విషయమే పదే పదే అంటుంటారు. "అవతల మనిషి మనస్సు దెబ్బతింటుందేమో" అనికూడా

ఆలోచించరు. ఒకరు అంటూవుంటే మిగతా అంతా తాళం వేస్తుంటారు. కొత్తలో శారదకి మరీ విచిత్రంగా అనిపించింది. వాళ్లలవాటేమోనని ఊరుకుంది. రానురాను అట్లా మాట్లాడితే చికాకుగా ఉంది. శారద పుట్టింటి వారింట్లో పులుపు ఎక్కువ తింటారని అత్తవారింట్లో అభిప్రాయం. అత్తగారి పుట్టింటి వారిగురించి ఏదైనా ఒక మాట మామగారు సరదాగా అంటే ఇంక అదే ఇంట్లో అందరికీ పాట. వచ్చిన చుట్టాల ముందర, స్నేహితుల ముందర ఆడబిడ్డలు, భర్తకూడా అత్తగారిని అంటూ ఉంటే శారద తనకే అవమానం జరిగినట్లుగా బాధ పడిపోయేది. శారద వచ్చిన కొత్తలో వంట చేయబోతే అత్తగారు "చూడమ్మా! శారదా! చింతపండు కొంచెం చూసి వెయ్యి. మంత్రిపగడవారమ్మాయివి. అనలే మీ ఇంట్లో పులుపెక్కువతింటారట" అన్నది.

ఇహ అది మొదలు శారద వంటచేసిందని తెలిస్తేచాలు చిన్న ఆడబిడ్డ, మరది కూడా చారో, పులుసో, నోట్లో పెట్టకుండానే "పులుపు, పులుపు అబ్బా!" అంటూ అల్లరి చేసేవారు. అత్తగారు మాత్రం 'నాకు చూపించే వేసిందంర్రా: ఎక్కువేంలేదు తినండి' అనేవారు. శారదకి మహా ఆశ్చర్యంగా ఉండేది, ఇంత సంస్కారం చదువు ఉన్నవాళ్లుకూడా అవతలివాళ్ల అత్మాభిమానం దెబ్బతినేటట్లు మాట్లాడటం. శారదకి వాళ్లు అట్లా అనగా అనగా రోషం ముంచుకొచ్చేది. కాని మరియాదకు కట్టుబడి, సంస్కారం, చదువు ఉన్న తను ఇట్లాంటి చిన్నవిషయాల్లో పైకి తేలకూడదని ఊరుకునేది.

మా పుట్టింట్లో ఇట్లా అస్తమానం గోత్రాలూ ఇంటిపేర్లూ ఎత్తి మాట్లాడరు. ఎవరు ఏ పనిచేసినా మిగతా అందరూ సహకరించటం అలవాటు. భోజనాల దగ్గర గొడవపెట్టరు నాన్నకి ఎవరు, ఎట్లా చేసినా తినటమే అలవాటు. ఇంక ఎవరైనా అట్లా చేసిన పదార్థాల గురించి అన్నా ఊరుకోరు. పోతే ఈ ఇంటిపేర్లు అలవాట్లు గురించికూడా ఇంట్లో మాట్లాడటం అలవాట్లేదు. అమ్మమ్మగారింటికి వెళ్లినపుడు శారద ఒకటి రెండుసార్లు విన్నది మామయ్య అక్కడ్నించి వచ్చేస్తుంటే పిల్లలందరికి తలో రూపాయి చేతిలో పెట్టాడు. శారద పుచ్చుకోలేదు. మామయ్య నవ్వుతూనే "ఇది అచ్చం మంత్రిప్రగడవారి అమ్మాయే, వాళ్లబెట్టు, నిక్కు అంతా దీని దగ్గరే ఉన్నట్లుంది" అన్నాడు. శారదకు దాని అర్థం తెలియకపోయినా రోషం ముంచుకొచ్చి కళ్లనీళ్లు తెచ్చుకొని అమ్మవెనకాల రాక్కుని "బండి ఎక్కి మనింటికిపోదాం" అంటూ మారంచేసింది. అమ్మమ్మ "అవున్రా వాళ్లబెట్టుసర్లు, మరియాదలు వాళ్లింట పుట్టినవాళ్లకి

రాక ఎక్కడకి పోతాయి?" శారద పైకి జవాబు చెప్పకపోయినా ఆరోషం మనస్సులోంచి చాలా రోజులు పోలేదు. తరవాత తను కాలేజీలో ఫస్టు మార్కులు, ప్రైజులు తెచ్చుకున్నపుడు నాన్న "చూశావా! మన శారద ఇంటిపేరు నిలబెడుతోంది" అని అమ్మతో అనటం అమ్మ "ఆఁచాల్లెండి!" అంటూ ఆ మాట ముగించటం తెలుసు.

ఈరోజు ఆదివారం. మామగారు ఎవరో ఇద్దరు పెద్దమనుషుల్ని భోజనానికి పిల్చేరు. ఉదయం శారదే వంటచేసింది శ్రద్ధగా. భోజనాలకి కూర్చున్నారు. అత్తగారికి వంట్లో బాగులేదని వడ్డనకికూడా రాలేరు శారద, పెద్దాడబిడ్డ సీతా వడ్డిస్తున్నారు. శారద ఎంతో నేర్పుగా జాగ్రత్తగా వడ్డిస్తోంది. ఆ వచ్చిన అతిథులతో పాటు, మామగారు, భర్త, మఱదికూడ భోజనాలకి కూర్చున్నారు. అంతర్జాతీయ విషయాలపై జరుగుతున్న చర్చ హటాత్తుగా ఆహారపదార్థాల వైపు మళ్లింది. అతిథుల్లో ఒకాయన మాయగారితో "అయ్యయ్య వెంకట్రామయ్యా గారూ! మీ ముందు పొగడటం కాదుగాని మీ ఇంట్లో ఆడపిల్లలు, కోడలుకూడా చదువుకుని ఉద్యోగాలు చేస్తున్నా ఇంతరుచిగా వంటలవీ చెయ్యటం అదృష్టమే సుమండీ! అన్నారు. సరిగ్గా ఆ టైముకే శారద పులుసు వడ్డన మొదలుపెట్టింది. మామగారు నవ్వుతూ "ఆఁ మా కోడలు అన్నీ బాగానే చేస్తుంది. కానీ అన్నింట్లో కాస్త చింతపండు మాత్రం ఎక్కువగా వేసేస్తుంది" మంత్రిప్రగడవారమ్మాయి, అంటూ పులుసూ అన్నం కలుపుకుని "కాస్త మెత్తనుప్పుకూడా వెయ్యమ్మా శారదా!" అన్నారు. మఱది పులుసు నాకిచూసి "బాబోయ్! పులుపు. కాస్త చక్కెరన్నా వెయ్యొదినా! అంటూ ఎగిరాడు. శారద భర్త పులుసు వడ్డించబోతే చేతులడ్డం పెట్టి "నాకొద్దు మజ్జిగ కావాలి" అంటూ పక్కనున్న పెద్దమనిషితో ఏదో మాట్లాడుతున్నాడు. అతిథులిద్దరూ వేయించుకొన్నారు. శారద ముఖం అవమానంతో, సిగ్గుతో కందగడ్డయింది. వాళ్లు భోజనాలు పూర్తి చేసి వెళ్లాక దీర్ఘంగా నిట్టూర్చింది.

తరవాత శారద కంచం దగ్గర కూర్చున్నదే కాని తినబుద్దికాలా. ఏదో తిన్నాననే వాలాయితీ తీర్చుకుని లేచింది. శారద మనస్సులో అదే విషయం మెదుల్తోంది. 'క్షణ క్షణం వీళ్ళు నన్ను ఇట్లా మాట్లాడతారేం? ఇలాంటి చిన్న విషయాలుకూడా అందరి ముందరా చదువూ సంస్కారంలేనివాళ్లలా మాట్లాడతారు. ఛీ ఛీ ఎంత జాగ్రత్తగా చేసినా, పులుపు సరిగ్గా వేసినా ఇట్లా అస్తమానూ, పుట్టింటిపేరు ఎత్తి మాట్టాడితే రోషం ముంచుకొస్తోంది. వీళ్ల కెట్లాగైనా పాఠం నేర్పాలి. మా ఇంటిపేరూ చింతపండు పులుపును చేర్చి మాట్లాడకుండా చెయ్యా" లనుకుంది.

సాయంత్రం వంటయింది. శారద భర్త ఇంకా ఇంటికి రాలేదు. శారదే వడ్డిస్తోంది. మిగతా అంతా భోజనాలకి కూర్చున్నారు. "పొద్దున్న అచ్చంగా మంత్రిప్రగడ వారింట్లో పులుసులాగే చేసిందొదిన" అంది చిన్నాడబిడ్డ. "ఈ పూట చారెలా ఉందో" అన్నది పెద్దాడబిడ్డ. అత్తగారు "చారు వెయ్యమ్మా శారదా!" అన్నది. మఱది "అదెంత పుల్లగా ఉందో? ముందు ఉప్పు, చక్కెర దగ్గర పెట్టుకుని కలుపుకో అమ్మా!" అన్నాడు. శారద మామగారికి చారు వడ్డించింది. అయన కాస్త రుచి చూడకుండానే కాస్త ఉప్పు కలుపుకుని తినటం మొదలుపెట్టారు. అత్తగారికి వెండిగిన్నెలో పోసి దగ్గర పెట్టింది. చిన్నాడబిడ్డకి వడ్డించబోతే "మరీ పుల్లగా లేదుగా వదినా?" అంటూ వేయించుకుంది. ఈ లోపల "వదినె చారు పెట్టటం, పుల్లగా లేకపోవడమూనా? చింతపండు బుట్ట ఖాళీ అయిందేమో చూడాలి" అంటూ నవ్వుతున్నాడు మఱది.

శారదకి కోపం, రోషం ముంచుకొచ్చాయి. దుఃఖంతో గొంతు గద్గదమైంది. గబగబ ఒక పళ్లెం తీసుకొచ్చి చారుగిన్నెలో చారు అందులో వంపేసి, లేని నవ్వు తెచ్చుకుని" చూసుకోండి! అసలివాళ చార్లో చింతపండే వెయ్యలేదు. ఎట్లా పులుపొచ్చిందో!" అంటూ ఇక అక్కడ నిలవకుండా గబగబా వెళ్లిపోయింది. డాబామీదికి.

-:o o o:-

# పేర్రాజు - ప్రేమ కండూతి

రాజు పదోసారి అద్దంలో చూసుకుని పౌడరు సరిచేసుకున్నాడు. తలకి మళ్లీ నీళ్లు రాసుకుని మళ్లీ దువ్వుకున్నాడు. ఎన్నిసార్లు దువ్వినా జుట్టు సరిగా వంగటం లేదు. సగం కోరిన కొబ్బరికాయలా ఉంది తలకాయ. మరోసారి అద్దంలో తలమొదలు బూట్లవరకు చూసుకుని బయల్దేరాడు వీధిలోకి.

ముద్దుగా రాజుకి వాళ్లమ్మా, నాన్నా వెంకటపేర్రాజు అని పేరు పెట్టుకున్నారు. ఇద్దరి తండ్రుల పేర్లూ కలిపి పాపం! ఎట్లాంటి ముద్దుముచ్చట్లూ చూడకుండానే కలరా తగిలి చనిపోయారు. అమ్మమ్మ ఈ మనవణ్ణి 'రాజూ!' అంటూ ముద్దుగా పిలుస్తూ పెంచి పెద్ద చేసింది. ఇప్పుడతనికి "రాజూ" అని పిలిస్తే కోపం వస్తుంది. "రాజ్" అని పిలవాలి లేకపోతే పలకడు. అదే అమ్మమ్మ పిలిస్తే "ఏంటమ్మా రాజూ! బూజూ అని పిలుస్తావేం?" అంటూ ఎగురుతాడు. ఆవిడ "అదేమిట్రా! పిలుస్తుంటే విసుక్కుంటావ్? నాకేం తెలుస్తుంది. కొత్తరకంగా పిలవటం, ముసల్దాన్ని," అంటూ సణిగి ఊరుకుంటుంది.

ప్రస్తుతం పూటకోరకంగా డ్రెస్ చేసుకుని వీధులంట మధ్యలో సిగరెట్లు కాలుస్తూ స్నేహితులతో కలిసి కిళ్లీ దుకాణాల దగ్గర నిలబడి వచ్చిపోయే వాళ్లని చూడటమే పనిగా పెట్టుకున్నాడు. ఈ మధ్య అదీ విసుగు పుట్టింది. ఏది చూసినా విరక్తి , ఎవరితో మాట్లాడాలన్నా విసుగు, కోపం. వీటన్నింటికీ కారణం ప్రేమ. ఎవరినన్నా ప్రేమించాడనుకునేరు! ఆ సందర్భం లేకనే బాధ. ఎవరినన్నా ఒక అందమైన అమ్మాయిని ప్రేమించాలనే పెద్ద కోరిక.

తనతో థర్డుఫారం చదివి మానేసిన హోటల్ సెర్వర్ సుబ్బు హఠాత్తుగా మెడ్రాస్‌లో ఒక నవనాగరిక యువతిని పెండ్లాడి తీసుకొచ్చాడు. 'ఇదేమిట్రా?' అంటే 'మాది ప్రేమరా' అన్నాడు గోముగా. తనతో చదివి కలెక్టరాఫీసులో యుడిసిగా పనిచేస్తున్న వెంకటేశ్వర్లు హైదరాబాద్ వెళ్లాడు. అతనికి కాబోయే భార్య డాక్టరట. అక్కడికేపోయి పెండ్లి చేసుకుంటాడట. తను కూడా అక్కడికే ట్రాన్స్‌ఫర్ చేయించుకుంటానన్నాడు. వీళ్లిద్దరి సంగతి విన్నప్పటి నుండి రాజుకి మహా యిదిగా ఉంది, తనూ ఎవరినైనా ప్రేమించి పెండ్లాడాలని.

ఎదురింటి కిటికీలోకి చూసి ప్రేమిద్దామా అంటే ఆ వళ్ల పార్వతి చూడటానికే భయంకరంగా ఉంటుంది. పక్కింట్లోని కొంగమెడ కోమలాంగిని ప్రేమిద్దామా అంటే పక్కింటికేసి చూడటానికి భయం. వాళ్లనాన్న పోలీసాఫీసరు. ఆయన్ని, ఆయన మీసాల్ని చూస్తే పరిగెత్తాలి.

"ఎట్లాగైనాసరే ప్రేమించాలి! పెళ్లి చేసుకోవాలి!" అనుకున్నాడు రాజు. ఈ పాడు ఊళ్లో ఇప్పుడే ఆడపిల్లల్ని కాలేజీకి పంపడం మొదలుపెట్టారు. పాడు ఊరు! ఇదే ఏ హైదరాబాదో, మెద్రాసో అయితే కావలసినంతమంది వీధులంట తిరుగుతుంటారు. అందమైన అమ్మాయిని ప్రేమించేయొచ్చు.

రాజుకు వాళ్లమ్మమ్మ, మేనమామ. మేనరికం లేకపోవడంవల్ల ఏవో సంబంధాలు చూస్తున్నారు. కాని అతనికి పిల్లని చూట్టానికి వెళ్లటం పాటపాడించటం, మాట్లాడించటం వాళ్లు పెట్టిన కాఫీ ఫలహారాలు పుచ్చుకొని రావటం ఇష్టంలేదు. జాతకం చూసి, కట్నం మాట్లాడి, లాంఛనాలతో చేసుకునే పెళ్ళి తంతే నచ్చలేదు. దాంట్లో ఏం స్వారస్యం వుంది? అందర్లాగ మనం చేస్తే ఏం గొప్ప? అనుకున్నాడు. "ప్రేమ! తల్చుకుంటేనే ఎంతహాయి. మొదటి చూపులోనే ప్రేమించుకోవాలి. హోటల్లో కాఫీ తీసుకొంటూ మనస్సులు విప్పి మాట్లాడుకోవాలి. ఒకరినొకరు అర్థం చేసుకొని సింపిల్‌గా రిజిస్ట్రారు ఆఫీసులో పెండ్లి చేసుకొని హోటల్లో స్నేహితులకి టీ పార్టీ చెయ్యాలి. తరవాత హనీమూన్' అని ఆలోచిస్తూ మురిసిపోతాడు. రాజ్ అనబడే ఆ వెంకటపేర్రాజు.

ఈ ప్లానంతా మనసులో వుంచుకుని అమ్మాయి కోసం, తనకినచ్చే అమ్మాయి కోసం, వెతకడం మొదలుపెట్టాడు. అలవాటు ప్రకారం టిప్‌టాప్‌గా డ్రెస్ వేసుకుని పౌడరు, సెంట్లు ఘుమఘుమలు ఆయుధాలుగా పట్టుకుని బయలుదేరాడు మన్మథునిలా ప్రియురాలి వేటకి.

అట్లాగే ఒక రోజు రైలు స్టేషన్‌వైపు బయల్దేరి వెళ్లాడు. ఎందరో రైలెక్కుతారు. దిగుతారు. వాళ్లలో తన ప్రియురాలు కనపడుతుందనే ఆశ. పేపరు కొని చేతిలో పట్టుకొని "ఎవరైనా చక్కని అమ్మాయి కనబడితే బాగుణ్ను" అనుకుంటూ ప్లాటుఫారం మీద షోగ్గా పచార్లు మొదలు పెట్టాడు. మెద్రాస్ వెళ్లే రైలు వచ్చే టైము. జనం హడావిడిగా -

తిరుగుతున్నారు. వాళ్ళని తప్పించుకొంటూ అటూ ఇటూ చూస్తూ, ఠీవిగా నడుస్తుంటే కాలికేదో గట్టిగా తగిలింది. "అబ్బా!" అంటూ కిందికి చూశాడు. ఎవరిదో పెట్టె. పక్కనే బెడ్డింగు, మూటలు పెట్టుకుని ఒక ముసలమ్మ కూర్చుని వుంది. రాజుకి చాలా కోపం వచ్చేసింది. వెంటనే "ఏంటవ్వా? పెట్టెలు మూటలు దారికడ్డంగా పెట్టుకుని కూర్చున్నావు? నీకు బుద్ధి ఉందా?" అంటూ అరవటం ప్రారంభించాడు. అవ్వ వెంటనే నవ్వుతూ "ఏందబ్బాయోయ్, నన్నంటావ్! ఆకాశం వొంక చూస్తూ నడుస్తుంటే ఏదన్నా తగులుతుంది' అంటూ మొదలు పెట్టింది చివాట్లు. ఇంతలో "ఎవరితోనవ్వా, పోట్లాడుతున్నావ్?" అంటూ సన్నని కంఠం వినిపించింది. వెనక్కి తిరిగి చూశాడు. పద్దెనిమిదేళ్ల అమ్మాయి ప్రత్యక్షమయింది. చామనచాయ, కోలముఖం, పెద్ద కళ్ళు ఆకర్షణీయంగా వుంది. తెల్లటి చీరె నగలవీ లేకుండా ఎంతో సింపిల్‌గా ఉంది. చేతిలో నాలుగు ఇంగ్లీషు పుస్తకాలు పట్టుకొన్నది. ఆమెను చూచి అవ్వ "లలితా! ఈ అబ్బాయి ఎవరో పైకి చూస్తూ నడుస్తున్నాడు. పెట్టె కాలికి తగిలిందని నాతో పోట్లాడుతున్నాడు" అన్నది. రాజు లలితను చూచి ఐసయిపోయాడు. "ఎక్స్క్యూజ్‌మి" అంటూ లలితవైపు తిరిగి నమస్కరించాడు. తరువాత అవ్వను శాంతింప చెయ్యటానికి ఎక్కడవరకండీ?" అంటూ పలకరించాడు. అవ్వ "పట్నం" అన్నది. ఈ లోపున రాజు లలితనే ఓరకంట చూస్తూ ప్రేమించేశాడు. ఆమె చేతిలో పుస్తకాలు చూస్తూ "చదువుతున్నారా?" అనడిగాడు. ఆమె నవ్వుతూ "ఇప్పుడే కొన్నాను" అని జవాబు చెప్పింది. రాజు తేరుకుని "అదికాదు మీరు కాలేజీలో చదువుతున్నారా?" అన్నాడు. లలిత తలవంచుకొని బి.ఎ సెకెండియర్. మీరో?" అన్నది. ఆ మాట వినేసరికి రాజు గుండెల్లో రాయిపడ్డది. ఏమి చెప్పాలా? అని సందేహంలో పడ్డాడు. యస్.యస్.యల్.సి రిజిస్టరు నిండిపోయినా పాసవలేక తిని తిరుగుతున్నానంటే బాగుండదని, "బి.యస్.సి పాసయి మద్రాసులో ప్రైవేటు కంపెనీలో పనిచేస్తున్నాను. 350 రూపాయల జీతం" అంటూ హుందాగా చెప్పేసి షర్టు కాలరు సర్దుకున్నాడు. లలిత "ఇప్పుడు మీరు మద్రాస్ వెళ్తున్నారా?" అని అడిగింది. అవునన్నాడు ఖంగారుగా. లలితతో మద్రాసు వరకూ ప్రయాణం చెయ్యవచ్చని మురిసిపోయాడు. ఇప్పుడే వస్తానని లలితకు చెప్పి హుషారుగా వెళ్లి మద్రాస్‌కి టిక్కెట్టు కొనుక్కున్నాడు. ఎప్పుడూ సిగరెట్లకి హోటళ్లకూ తప్ప ఖర్చు పెట్టని రాజు ఒక డజను బత్తాయిపండ్లు కొనితెచ్చి లలిత వాళ్లవ్వ చేతిలో పెట్టాడు. అవ్వ వద్దు వద్దని మొహమాటపడుతూనే సంచిలో వేసుకుంది.

మరో అరగంటకి బడికి లేటయిందని పరిగెత్తుతూ వచ్చి ఆయాసపడుతున్న పిల్లవాడిలా వచ్చి ఆగింది మెడ్రాస్‌పోయే రైలు. కాస్త ఖాళీగా వున్న పెట్టె చూచి రాజు, అవ్వనీ సామాన్లని ఎక్కించాడు. సంచిలో దుప్పటి తీసి కిటికీ దగ్గర పరిచేసి అవ్వని కూర్చో పెట్టాడు. లలిత అవ్వ పక్కనే కూర్చుని మాట్లాడుతోంది. రాజు పేంటు జేముల్లో చేతులు పెట్టుకుని దర్జాగా తలుపు దగ్గర నిలుచున్నాడు. రైలు బయలుదేరే వేళయింది. లలిత రిస్టువాచీ చూసుకుని తానూ తలుపు దగ్గరికి వచ్చి రాజు పక్కనే నిల్చుంది. రాజు షర్టు కాలరు సరిచేసుకుని క్రాఫింగ్ సరిచేసుకుంటూ తామిద్దర్నీ చూసినవాళ్లు భార్యాభర్తలనుకోవాలని తాపత్రయపడుతున్నాడు. రైలు బయలుదేరేందుకు గంటకొట్టారు. అది వినగానే లలిత రైలు దిగేసింది. రాజు "దిగుతున్నారే? టైమయింది" అన్నాడు.

"మా అవ్వను రైలెక్కించడానికి వచ్చాను" అంటూ అవ్వతో "అవ్వా, నీకు పట్నం వరకూ మంచి తోడు దొరికింది" రాజును చూపిస్తూ "వీరు చాలా మంచివారు. నీకు కావలసిన సహాయం చేస్తారు" అన్నది. ఇంతలో రైలు కదిలింది. నెమ్మదిగా కదులుతున్న రైలుతో బాటు లలిత నడుస్తూ రాజుతో "కాస్త మా అవ్వను సామాన్లనూ మద్రాస్‌లో దింపండి" అన్నది. మెల్లిగా రైలు వేగం హెచ్చింది లలిత చిరునవ్వుతో వెనక్కు తిరిగింది.

క్వశ్చన్ మార్కు మొహంతో ఉన్న రాజు రైలులో పోతున్నాడు.

-:o o o:-

# అమ్మకోసం

మురళి రెండు చేతులూ తలక్రింద పెట్టుకుని ఆకాశం వంక చూస్తూ పడుకున్నాడు. తదియ వెన్నెల మసక మసకగా జారిపోతోంది. నక్షత్రాలు గుంపులు గుంపులుగా నల్లటి ఆకాశం మీద మెరుస్తున్నాయి. అది చూస్తుంటే మురళికి వాళ్లమ్మ కట్టుకునే జరీ చుక్కల నల్ల చీరె జ్ఞాపకం వచ్చింది. ఇవాళ మురళి ఆలోచనలన్నీ అమ్మ గురించే.

సాయంత్రం క్లాసు నుంచి రాగానే లెటర్ బాక్స్ చూసుకున్నాడు. రెండు కవర్లు. దస్తూరీనిబట్టి "ఒకటి మామయ్య, మరోటి అమ్మ" అని తెలుసుకున్నాడు. ఇద్దరి ఉత్తరాలు ఒక్కసారి వచ్చినందుకు ఆశ్చర్యపోయాడు. రూమ్ చేరిన తర్వాత జోళ్లు కూడా విప్పకుండానే మంచం మీద వాలిపోయాడు. ఆశ్చర్యం! అమ్మ ఉత్తరంలో రెండే రెండు లైన్లు, "మామయ్య ఉత్తరం అందే ఉంటుంది. నువ్వూ పెద్దవాడివి అవుతున్నావు. నీ అభిప్రాయం తెలియజేయి!' అని, "ఏమిటబ్బా!" అనుకుంటూ ఆత్రంగా రెండో కవరు విప్పాడు. మామయ్య మూడు పేజీల ఉత్తరం రాశాడు. మురళీ ట్రైనింగు పూర్తి కావస్తున్నందుకు సంతోషిస్తూ, త్వరలోనే పైలట్ ఆఫీసరుగా చూడాలని ఆశిస్తున్నానంటూ రాశాడు. మురళి ఉత్తరం మడచి ఒక్క క్షణం ఆలోచించాడు. నిజమే. ఇరవై రెండేళ్లు నిండుతున్నై. నిన్న కాక మొన్నటి వరకూ తాతగారి ఒడిలో కూర్చుని కథలు వింటున్నట్టు, మామయ్యతో బజారు కెళ్తున్నట్లూ ఉంది. అప్పుడే తను ఇంజనీరింగ్ పాసవటం ఏర్‌ఫోర్స్‌లో చేరటం జరిగింది. ఈ ట్రైనింగ్ పూర్తయితే ఎక్కడ వేస్తారో ఏమో! మళ్లీ ఉత్తరం చదటం ప్రారంభించాడు. తరవాత భాగం చదివేసరికి కళ్లు చీకట్లు కమ్మినై. అక్షరాలు కెలుక్కుపోయాయి.

ఉత్తరం అక్కడ పడేసి డైనింగ్ హాలుకి వెళ్లి కాఫీ తాగి ముఖం కడుక్కుని మళ్లీ రూమ్‌కి వచ్చి తల దువ్వుకున్నాడు. అద్దంలో ముఖం చూచుకుంటే ముఖం బాగా వాడిపోయినట్టు కనిపించింది. చేతిలో పుస్తకం పట్టుకుని పై డాబామీది కెక్కాడు. తనలాగే మనస్సుకు, శరీరాలకు విశ్రాంతి కోసం వచ్చి ఆఫీసరు ట్రైనిస్ అక్కడా అక్కడా కూర్చున్నారు పుస్తకాలు పట్టుకుని.

మురళి ఒక మూల పిట్టగోడ మీద కూర్చున్నాడు. దూరంగా ఎక్కణ్ణించో "గాలిలో నా బ్రతుకు తేలిపోయినదోయి" అని సన్నగా పాట వినిపిస్తోంది. ఆ పాట వినగానే మాధవరావు

జ్ఞాపకం వచ్చాడు. అతను మామయ్య స్నేహితుడు. ఎప్పుడూ అమ్మ అతని చేత ఆ పాట మళ్లీ మళ్లీ పాడించుకుని వినేది. అతడు అమ్మను "సౌమ్యా!" అని పిల్చేవాడు. అమ్మ పేరు శ్యామల. సౌమ్యంగా ఉంటుందని మాధవరావుగారు "సౌమ్యా!" అనేవారు. మురళి మళ్ళీ మామయ్య ఉత్తరం తెరిచాడు.

"మీ అమ్మ, సీతాపతి వివాహం చేసుకోవాలని అనుకుంటున్నారు. మీ అమ్మ సంగతి నీకు బాగా తెలుసు. నీకు ఇష్టంలేని పని ఆమెకీ ఇష్టం ఉండదు. కాబట్టి నీవు ఈ విషయం బాగా ఆలోచించి మీ అమ్మకుకాని, నాకుకాని జవాబు రాయి" అని మామయ్య విషయాన్ని క్లుప్తంగా విశదీకరించాడు.

మురళి ఆలోచనలు తల్లిమీదకు పోయినై. అమ్మకి మహా ఉంటే ముప్పై అయిదేళ్లుంటై. చిన్నతనంలోనే వివాహం అయింది. పదమూడేళ్లకే మురళి పుట్టాడు. పోలీసు ఇన్స్పెక్టర్గా పనిచేసే మురళి తండ్రి జీపు ప్రమాదంలో చనిపోయాడు. అప్పుడు మురళికి ఆరు నెలల వయస్సు. ఆ పసివానితో పుట్టింటికి చేరింది శ్యామల. భర్తపోయిన దుఃఖాన్ని కూడా అర్థం చేసుకోలేని వయస్సు. శ్యామలని తండ్రి తిరిగి చదువులో ప్రవేశపెట్టాడు. బొట్టులేకుండా పిల్ల ముఖం చూడలేమని పినతండ్రి ఆ కట్టడులన్నీ సడలించాలని అన్నగారితో వాదించి, గెలిచాడు.

శ్యామలకన్న రెండేళ్లు పెద్ద కేశవరావు. అతనికి శ్యామలంటే మిగతా ఇద్దరు చెల్లెళ్లకంటే జాలి, అభిమానం ఎక్కువ. ఆఖరి తమ్ముడు రవి, మురళి ఇంచుమించు ఒకే ఈడువాళ్లు. మురళి ఎక్కువగా అమ్మమ్మ తాతయ్యల దగ్గరే చనువుగా పెరిగాడు. శ్యామలకి కొడుకులాకాక తమ్ముడిలా ఉండేవాడు. శ్యామల చెల్లెళ్లకీ, అన్నకీ పెళ్లిళ్లు జరిగాయి. మురళి పెద్ద పెరిగిన కొద్దీ తన తల్లి విషయాలు గ్రహించడం మొదలు పెట్టాడు.

శ్యామల చదువు పూర్తి అయాక తండ్రి పనిచేసే బాంక్లోనే పనిచేసేది. బక్కపల్చగా పొడుగ్గా ఉండేది. పల్చని చెంపలూ, పెద్ద పెద్ద కళ్లతో ఆకర్షణీయంగా ఉండేది. మురళికి జ్ఞానం వచ్చేసరికి శ్యామల గంభీరంగా తయారయింది. యాంత్రికంగా తండ్రితోపాటు కార్లో బాంక్కు పోయి పని చేసుకువచ్చేది. అక్కడ కూడా మౌనంగా గంభీరంగా పనిచేసేది. అందరూ గౌరవంగా చూసేవారు. ఇంట్లో కూడా తన డ్యూటీ అన్నట్లు పనిచేసుకుపోయేది.

చెల్లెళ్లు పిల్లలతో వచ్చినప్పుడు వాళ్లకే లోటు రాకుండా చూసుకొనేది. కాని వాళ్ల హాస్యసంభాషణల్లో పరిహాసాల్లో పాల్గొనేది కాదు. ఇంట్లో కథలు కార్యాలు జరిగేటప్పుడు కూడా బయటికి వచ్చేదికాదు. మురళికి క్రమక్రమంగా పరిస్థితులు అర్థం కాసాగాయి. తన తల్లి వీటన్నింటికీ ఎందుకు దూరంగా ఉంటోందో అర్థం అయింది. మురళితో కూడా ఏ స్నేహితుడితోనో, తమ్ముడితోనో మాట్లాడినట్టు మాట్లాడేది. మురళికి మొదటి నుంచీ పెద్ద మామయ్య కేశవరావంటే అభిమానం జాస్తి. అతను తన తల్లిని ఎప్పుడూ ఒక కంట కనిపెడుతూ ఉంటాడని తెలుసు. ముఖ్యంగా ఇంట్లో శుభకార్యాలు వగైరా జరిగినప్పుడు, శ్యామలని ఎవరు ఏ మాట అని నొప్పిస్తారోనని భయం.

కేశవరావు డాక్టరుగా కాకినాడలో ప్రాక్టీసు పెట్టాడు. సొంత ఇల్లుందనీ కొడుకు దగ్గరుండాలనీ శ్యామల తల్లీ తండ్రి కూడా రిటైరయాక కాకినాడలోనే స్థిరపడ్డారు. మద్రాస్‌లో శ్యామల వంటరిగా మిగిలిపోయింది.

మురళి ఇంజనీరింగు ఫస్టుక్లాసులో పాసయినప్పుడు కూడా మౌనంగా గంభీరంగా ఉండిపోయింది. బెంగుళూరు ట్రైనింగ్‌కి వచ్చాక తరచుగా తల్లిని చూడాలనిపించేది మురళికి. ఖరగ్‌పూర్‌లో చదివినన్నాళ్లు వేసవిలో తప్ప ఇంటికి వచ్చేవాడు కాదు. చదువు పోతుందని భయం. పెద్దయిన తర్వాత తాతగారింట్లో కూడా బెరుకుగా అనిపించేది మురళికి. మద్రాస్ వెళ్లినప్పుడల్లా మురళికి తల్లిని చూస్తే జాలేసేది. కాని అది వ్యక్తీకరించడానికి భయం. "నీకేం పర్వాలేదు. నా ట్రైనింగు పూర్తికాగానే ఉద్యోగం వస్తుంది. నీ ఉద్యోగం మానేసి నా దగ్గర వచ్చి ఉండమ్మా!" అని చెప్పాలనుకునేవాడు. కాని చెప్పలేకపోయేవాడు. ఉదయం భోజనం చేసి బాంక్‌కి వెళ్తూ "కాఫీ ఫ్లాస్కులో ఉంది. టిఫిను టేబిల్ మీద పెట్టాను. బయటికి వెళ్లేటట్లయితే పర్సులో డబ్బులున్నాయి తీసుకో!" అని చెప్పి వెళ్లేది. సాయంత్రం రాగానే వంట చేసేది. ఇద్దరూ భోజనం చేసేవారు. భోజనం కాగానే ఏదో ఒక పుస్తకం పట్టుకుని పడక్కుర్చీలో వాలిపోయేది. ఒక్కొక్కసారి మురళి అర్ధరాత్రి లేచి చూసినా తల్లి అలా కుర్చీలోనే చదువుతూ కూర్చోవటం గమనించి "పడుకో అమ్మా! చాలా రాత్రయింది!" అనేవాడు. "ఆ... ఆ...!" అనేది కాని అలాగే కూర్చునేది. తను దగ్గరున్నా ఆమె వంటరితనం పోగొట్టలేనని మురళికి తెలిసి మౌనంగా ఉండిపోయేవాడు.

ఇప్పుడు సీతాపతిగారిని వివాహం చేసుకోవాలనుకున్నదన్నమాట! ఆయనని మురళి ఒకటి రెండుసార్లు కేశవ మామయ్యతోపాటు చూసేడు. లావుగా పొడుగ్గా ఉంటాడు. ఎప్పుడూ నవ్వుతున్నట్లుండే చిన్నకళ్లు. ఒక సారి చూస్తే మరచిపోలేని విగ్రహం. మద్రాస్‌లోనే ఏదో ఫారిన్ కంపెనీ మేనేజరు. చాలా రోజులు ఫారిన్‌లో ఉండి వచ్చాడని, వివాహం కాలేదని మురళి విన్నాడు. అతనికీ, అమ్మకీ ఎలా కుదిరిందో? కేశవ మామయ్య కుదిర్చి ఉంటాడు. తనొక్కడే అమ్మ గురించి బాధపడేవాడు. అమ్మ పక్కన మరో మనిషిని ఊహించుకోవటం మురళికి కష్టంగా ఉంది. అమ్మ తనొక్కడికే స్వంతం అనిపిస్తుంది.

నిజంగా ఆలోచిస్తే తను చాలా స్వార్థపరుడు. తనూ పెద్దవాడయ్యాడు. తన చదువూ, స్నేహితులూ. ఈ గొడవలో పడి ఇన్నాళ్లూ అమ్మ సంగతి ఆలోచించలేదు. నిజమే. అమ్మకి మాత్రం ఒక సహచరుడు కావాలని ఉండదూ! అందరిలాగే తన సంసారం, తన ఇల్లు, తన మనుష్యులు కావాలని ఉండి ఉంటుంది. చిన్నతనంలో తల్లితండ్రుల సంరక్షణలో, అన్నదమ్ముల మధ్య తెలియదు. పెరిగినకొద్దీ ఆ వంటరితనం ప్రబలిపోయింది. తను అర్థం చేసుకోడానికి వయస్సు చాలదు. పోనీ, ఇన్నాళ్లకు మామయ్య అయినా అనుకొని ఉంటాడు అమ్మగురించి. తాతగారు, అమ్మమ్మ ఏమనుకొంటారో! అయినా మామయ్య ఎవ్వరినీ లెక్కచేసే మనిషి కాడు. మామయ్యకి జవాబు రాసెయ్యాలి.

ఇలా అనుకొంటూ మురళి గబగబా డాబా మీది నుంచి దిగి తన గదికి వెళ్లాడు. రూమ్‌మేటు మోహన్ నవ్వుతూ "డైనింగ్ హాల్లో భోజనానికి రాకపోతే మీరు పిక్చరుకి వెళ్లారని అనుకొన్నాను!" అన్నాడు. ఆ మాటలు మురళి విన్పించుకున్నట్టు లేదు. గబగబా లెటర్‌పాడ్ తీసి మామయ్య పేర ఉత్తరం రాసేదు. "మీ అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాను. మీరేది చేసినా అమ్మ మంచికే చేస్తారని తెలుసు! నేను రావడం అవసరం అనుకుంటే రాయండి, వెంటనే వస్తాను!" అని.

ఉత్తరం పోస్టు చేసి వచ్చి విశ్రాంతిగా పడుకున్నాడు. మురళి ఊహల్లో, తన తల్లి శ్యామల మనసారా నవ్వుతూ సీతాపతిగారి పక్కన కూర్చుని కార్లో వెళ్తోంది. మురళి కూడా తృప్తిగా నవ్వుకొంటూ నిద్రలోకి జారిపోయాడు.

-:o o o:-

# మమకారం

సాయంత్రం ఆరుగంటలయింది.

శ్యామల బాల్కనీలో కుర్చీవేసుకొని కూర్చుంది. ఆమె ఒళ్ళో పుస్తకం ఉన్నది కాని చదవటంలేదు. ఆలోచనలు ఎక్కడో ఉన్నై, మనసు మనసులో లేదు. ఆమె చూపులు దేన్నో వెతుకుతున్నట్లున్నై, ఎదురుగా బస్సుస్టాపు. బస్సు సిటీనుంచి జనాన్ని నింపుకొని వచ్చి ఖాళీచేసుకొని పోతున్నది. బస్సులోంచి దిగిన జనం సాయంత్రము గూళ్ళకి చేరే పక్షుల్లాగా పోతున్నారు. శ్యామల ఇవేమి గమనించటంలేదు, కారణం- ఇవాళ ఆమె ప్రక్కన చిట్టిలేకపోవటమే! రోజూ ఇదే వేళకి బాల్కనీలో శ్యామల ప్రక్కన బొమ్మలో, పుస్తకాలో పెట్టుకుని కూర్చుంటుంది. మధ్య మధ్య శ్యామల బుగ్గలు పట్టుకొని తనవైపు తిప్పుకొని 'పిన్నీ! కన్నమాయ ఇంకారాలేదేం? బిళ్ళలు తెత్తానన్నాడు. దొంగ! ఇంకారాలే!" అంటుంది. మరోసారి 'పిన్నీ! పిన్నీ! పాకిత్తాన్ చచ్చింది, పేపర్లోవుంది. తాతాలు చూసి చెప్పేరు" అంటుంది. నాలుగేళ్ళ చిట్టి ప్రశ్నలకు శ్యామల ఒకొక్కసారి జవాబులు చెప్పలేకపోతుంది. ఆఫీసుకుపోయిన టైములో తప్ప మిగతా సమయంలో శ్యామలను వేపుకుతింటుంది. శ్యామల విసుక్కోదు. చిట్టి, శ్యామల అక్క, శారదకూతురు. ఇద్దరూ ఉద్యోగాలు చేసేవాళ్ళవటంవల్ల, చిట్టిని అమ్మమ్మగారింట్లో వదిలేశారు.

శ్యామలకి చిట్టితోడిదే లోకం. ఈసారి చిట్టిని వాళ్ళమ్మా, నాన్నా తీసుకెళ్ళిపోయారు. అసలు చిట్టిని వాళ్ళమ్మతో పంపటం శ్యామలకి ఇష్టంలేదు. కొద్దిగా తల్లితో వాదించింది. ఆమెపై కోపం తెచ్చుకొంది కూడా. తల్లిమాత్రం శ్యామలను పక్కకి పిల్చి "ఊరుకోవే! బావవింటే బాగుండదు. వాళ్ళపిల్లను వాళ్ళు తీసుకెళ్తారు. వాళ్ళకి మాత్రం పిల్లను వాళ్ళతో తిప్పుకోవాలని ముచ్చటగా ఉండదూ! దాన్ని స్కూల్లో జేర్పిస్తారట!" అంటూ సర్దిచెప్పబట్టిగాని లేకపోతే శ్యామల ఊరుకొనేది కాదు. అందులో చిట్టి పుట్టినప్పట్టి నుంచి శ్యామల దగ్గరే పెరిగింది. ఇంట్లో తాతను, అమ్మమ్మనూ, పిన్నిని మామయ్యనూ ఆడిస్తూ నవ్విస్తూ వాళ్ళకి కాలక్షేపముగా ఉండేది.

"శ్యామలా! భోజనానికి రావేం! నాన్నా, కన్నా వచ్చేశారు, లైటన్నా వేసుకోకుండా కూర్చున్నావేం?" అంటూ, కామేశ్వరమ్మగారు కేకేశారు. శ్యామల తుళ్ళిపడి 'ఆc ఆc' అంటూ

లేచి లోపలికి నడిచింది. ఎదరుగా నాన్న వెంకట్రావుగారు స్నానంచేసి ఒళ్ళుతుడుచుకొంటూ రావటం కనిపించింది. మళ్ళీ చిట్టి జ్ఞాపకం వచ్చింది. ముద్దు మాటల్తో "తాత బంగారు తల్లి. ఎంచక్కా బొబ్బపోసేసుకుంది. బువ్వ పెత్తమ్మమ్మ!" అంటూ గొడవచేసేది. అంతా భోజనాలకి కూర్చున్నారు చిట్టి కూర్చునేచోటు ఖాళీగా వుంది. చిట్టి రోజు భోజనం దగ్గర అల్లరి చేస్తుంది. నాన్న పరిషించటం చూసి "నేనూ పూజచేసి బువ్వ తింతాను" - అంటూ కంచంచుట్టూ నీళ్ళు ఒంపుతుంది. ముందర పెట్టినా తినదు. అందరితో కూర్చుని కబుర్లు చెబుతూ తినేది.

శ్యామల కంచం ముందు కూర్చుంది కాని చిట్టి మాటలూ చేష్టలు గుర్తువచ్చి అన్నం తినబుద్ధికాలా! మెల్లగాలేచి చెయ్యికడిగేసుకుంది. తల్లి నవ్వుతూ "చిట్టిలేకపోతే తోచటంలేదు, కాని కాస్త అన్నమన్నా తినకపోతే ఎట్లా! రేపు ఆఫీసుకు పోవద్దూ, శ్యామలకు ఆ మాటలు వినపడలేదు. లేచి వెళ్ళి పడుకుంది. అక్కడా చిట్టి చోటు ఖాళీ. రోజూ పిన్ని కథలు చెప్పాలి, ఆ కథలు వింటూ పిన్ని మెడను చిన్నిచేతుల్తో కావిలించుకొని నిద్రపోయేది. శ్యామలకు రాత్రంతా నిద్రపట్టలేదు. తెల్లవారుతూ ఉండగా కాస్త నిద్రపట్టింది. ఆ కలతనిద్రలోనే కల చిట్టి 'లే పిన్నీ కొత్తగౌను తెత్తానన్నావుగా లే, తాతా ఆఁయ్ అంటారు. ఆపీచుకుపో! కన్నమాయ బస్సు ఎలిపోయింది. అమ్మమ్మ 'బువ్వలేడీ!' అంటోందిలే!" అంటోంది శ్యామల నిద్దట్లోనే "అబ్బా! ఉండు చిట్టీ" అని విసుక్కుంటోంది. పక్కనే తలదువ్వుకుంటున్న వెంకట్రావుగారు 'లే' చిన్నతల్లీ! లేరా! తెల్లవారేక కలవరిస్తున్నావు" అంటూ కూతురి తల జాలిగా నిమిరారు. శ్యామల తుళ్ళిపడిలేచి చుట్టూ చూసింది. వెంటనే ఆయన "నేనమ్మా! చిట్టనుకున్నావా! పిచ్చితల్లీ! లే, టైమవుతోంది!" అంటూ శ్యామలను అనునయించారు.

శ్యామలకి లేవబుద్ధికాలేదు. కాని ఎదురుగా నాన్న నుంచోటం చూసి లేచి కూర్చుంది. నాన్న పేపరు చూస్తున్నారు. పేపరు తిరగేస్తూ ఆయన "శ్యామలా! చిట్టి లేకపోతే తోచటంలేదమ్మా! అసలు పేపరు చూడనిస్తుందా? 'టార్జాన్ చూపించు, పాకిత్తాన్ చచ్చిందా!' అంటూ నా చేతిలో పేపరు తీసుకొని కాగితాలన్నీ పరచుకొని కూర్చునేది వెర్రితల్లి. వాళ్ళమ్మని ఏం వేధిస్తున్నదో!" అన్నాడు. శ్యామల లేచి లోపలికి వెళ్లిపోయింది.

శ్యామల అన్యమనస్కంగానే పన్లు పూర్తిచేసుకొని భోజనానికి కూర్చుంది. నాన్న ప్రక్కన. అమ్మ వడ్డిస్తూ "చూడండీ! ఇల్లంతా ఎంత చిన్నబోయిందో! చెయ్యి విరుచుకున్నట్లుంది.

లేచిన దగ్గర్నుంచి 'అమ్మమ్మా! అమ్మమ్మా!' అంటూ నా కూడా తిరిగేది" అంటూ నిట్టూర్చింది. నాన్న "ఆఁ పరాయిపిల్ల, వాళ్ళమ్మా నాన్నా తీసికెళ్ళారు, మనం ఏమంటాం? మన దగ్గరుంచినన్నాళ్ళు మన ముచ్చట, అయినా మధ్యలో ఒక్కవారమేగా! దసరాకి సెలవులు కలిసొస్తే రానేవస్తారు. ఇంట్లో తిరిగేపిల్ల వెళ్ళిపోతే చిన్నబోదూ! రేపు శ్యామలకూడా అత్తారింటికెళ్తే ఎలా వుంటామో! ఏమో! అసలు శారదగనక దాని కూతుర్ని ఇన్నాళ్ళు మన దగ్గర వదలిపెట్టింది. ఈ చిన్నది అసలు దాని పిల్లల్ని వదలిపెట్టదు. ఇది చిట్టికోసమే ఇంత బెంగపెట్టుకొంది. దాని పిల్లల్ని ఎట్లా చూసుకొంటుందో!" అంటూ కూతుర్ని నవ్వించే ప్రయత్నం చేశారు. శ్యామల ఆ హాస్యాన్ని ఆస్వాదించే మూడ్‌లో లేదు. తల వంచుకొని భోజనం పూర్తయిందనిపించుకొని వెళ్లిపోయింది.

శ్యామల యాంత్రికంగా వెళ్ళి బస్సెక్కింది. రోజూలాగే వెనక సీట్లో మూలగా కూర్చుంది. ప్రక్కనే కూర్చున్న విద్యావతి, సురేఖ ఇద్దరూ పత్రికలో వచ్చే సీరియల్ గురించి సీరియస్‌గా చర్చించుకొంటున్నారు. వారి సంభాషణ శ్యామల చెవికెక్కటంలేదు.

శ్యామల తన ముఖంలోని భావాలు ఎవ్వరికీ కనబడకుండా పత్రిక ముఖానికి అడ్డం పెట్టుకుంది. శ్యామలకి మళ్ళీ చిట్టి జ్ఞాపకం వచ్చింది. ఆ పిల్ల బాల్కనీలోనుంచుని రోజూ పిన్నికి "టా! టా!" చెప్పేది. శ్యామల తమయింటివైపు చూసింది. బాల్కనీలో అమ్మనుంచుని ఉంది ఒంటరిగా. ఆ అలసట నిండిన ముఖం, చెదిరిన ముంగురులు, చెమటకి కరిగి జారుతున్న బొట్టుతో తల్లిని చూస్తే శ్యామలకి జాలేసింది. ముఖం తిప్పుకొని టైం చూసుకుంది, టైమయినట్లుంది, బస్సు కదిలింది. ఇంకా కొందరు మహానుభావులు భుక్తాయాసంతో పంచలుపట్టుకొని పరుగెత్తలేక పరుగెడుతూ బస్సు అందుకుంటున్నారు.

శ్యామల అన్యమనస్కంగా వుండటంవల్ల బస్సు "లకడీకాపూల్" చేరినదే తెలియదు. కండక్టరు "లకడీకాపూల్, పహలే ఉతర్‌నేదీజియే సాబ్! అమ్మా! జగానహీఁహై, దూసరీ బస్‌మే ఆయియే!" అంటూ కేక పెడుతున్నా శ్యామలకి తెలియదు సురేఖ "దిగండి!" అని హెచ్చరించేవరకూ శ్యామల దిగలేదు, ఇద్దరూ దిగేరు, బస్సు వెళ్ళిపోయింది.

శ్యామల నెమ్మదిగా ఆఫీసు చేరింది. అటెండెన్స్‌లో సంతకం పెట్టి సెక్షనులోకి వెళ్ళింది. సీట్లో కూర్చుని పర్సులోంచి అలమారు తాళంచెవులు తీస్తుండగానే ప్యూన్ ఇమామ్ వచ్చి

"అమ్మా! మీకు పి.ఏ. పిలుస్తున్నె!" అన్నాడు. "వీడి తెలుగు పాడుగాను" అని మనస్సులో అనుకొని పైకి "వస్తున్నానని చెప్పు!" అంటూ పెన్ చేత్తోపట్టుకొని పి.ఏ. రూమ్‌లో ప్రవేశించింది.

పి.ఏ. సీరియస్‌గా ఏదో ఫైలు చూస్తున్నారు. అది పూర్తయేవరకూ ఆయన తలయెత్తే అలవాటులేదు. శ్యామల దగ్గరగావెళ్ళి "నమస్కారం!" అన్నది. ఆయన తలయెత్తి సౌమ్యంగా నవ్వుతూ "వచ్చావా అమ్మా! శ్యామలా! నీ కోసమే చూస్తున్నాను. నిన్నటి స్టేటుమెంటు పూర్తయిందా? డిస్పాచ్ అయిందా? ఇవాళ మళ్ళీ డి.ఓ. వచ్చింది" అన్నారు. శ్యామల ఆయన మాటకడ్డంవచ్చి "నిన్ననే పంపించేశాం కదూ! మీరే ఫేయిర్ కాపీ సంతకం చేశారుగా! డిస్పాచ్డ్ కాపీ చూపించమంటారా?" అన్నది ధైర్యంగా. ఆయన నవ్వుతూ "మర్చిపోయానమ్మా! పెద్దవాణ్ణయిపోతున్నానుకదూ! డిస్పాచ్డ్ కాపీ చూపించక్కర్లేదు, నువ్వు చెప్తే నాకు నమ్మకమే!" అన్నారు.

శ్యామల తిరిగి సెక్షనులోకి వచ్చి కూర్చుంది. అలమార్లోంచి ఫైల్సు తీసి ముందు పెట్టుకొని కూర్చుంది. సెక్షను హెడ్ వచ్చి "ఏమ్మా! పి.ఏ. మీ కొరకు రెండు మార్లు కబురు చేసినారు. పోయి వస్తిరా! ఆ స్టేటుమెంటు పూడ్చిందా?" అన్నారు. శ్యామల "ఆ చెప్పే వచ్చానండి. స్టేటుమెంటు నిన్ననే పంపించేశాను!" అన్నది తల వంచుకొని ఫైల్సు చూసుకోసాగింది. కాని రాత్రంతా నిద్రలేకపోవటంవల్ల, మనస్సు బాగలేక ముఖం వాడిపోయి కూర్చుంది. రోజు ఉత్సాహంగా నవ్వుతూ చురుకుగా పనిచేసుకుపోయే శ్యామలను చూసేసరికి సెక్షను సూపరింటెండెంటుకి జాలేసింది. ఆయన మళ్ళీ శ్యామల సీటు దగ్గరకు వచ్చి "ఏమ్మా! ఒళ్ళు బాగాలేదా! నిండా ఇదిగా ఉండారే! లీవు ఎత్తుకోకపోతిరా! నేనుదా ఇక్కడ ఉండాను. పి.ఏ.కి చెప్పేదిదానే!" అన్నారు. శ్యామల బలవంతంగా నవ్వుతూ "ఏం లేదండీ! కొంచెం తల నొప్పిగా ఉన్నది!" అన్నది. ఆయన ఖంగారుగా "ఏయ్యా సుబ్బయ్యా! కొంచెం కాఫీ తెచ్చి పెట్టప్పా! పి.ఏ. దగ్గర చెప్పేసి ఫ్లాస్కు ఎత్తుకొనిపో!" అన్నారు. తరువాత ఖంగారుగా ఫైల్సు పట్టుకొని అటూ ఇటూ తిరుగుతూ పనిలో మునిగిపోయారు.

శ్యామల ఆయన అభిమానాన్ని కాదనలేక కాఫీ తాగింది. చిరాగ్గా ఉన్నా పని మాత్రం చకచకా చేసుకుపోతోంది. పక్కనే ఉన్న ఫ్యూను రాము ఆ ఫైల్సు ఎక్కడికి చేరవలసినవి

అక్కడికి చేరుస్తున్నాడు. పని హడావిడిలో టైం తెలియకుండానే జరిగిపోతుంది. శ్యామల తల ఎత్తి చూసేసరికి అంతా కాఫీలకి వెళ్ళిపోయారు. టిఫిను తినబుద్ధికాక ఫ్యానుకిచ్చేసి కాఫీ తెప్పించుకు తాగింది. మళ్ళీ పి.ఏ. దగ్గర్నుంచి పిలుపు వచ్చింది.

శ్యామల పి.ఏ. రూములో ప్రవేశిస్తూ "ఏ ఫైలు గురించి అడుగుతారో" అనుకుంది. ఆయన తీరిగ్గా కుర్చీలో వెనక్కి జారబడి, శ్యామలని చూసి "రామ్మా రా! కూర్చో! టిఫినయిందా; అలా ఉన్నావేం? ఒంట్లో బాగులేదా! ఇప్పుడే నాన్నగారు ఫోన్ చేశారు- "మా అమ్మాయి ఎలా ఉంది?" అంటూ, ఏమిటి సంగతి?" అంటూ నెమ్మదిగా ప్రశ్నలవర్షం కురిపించారు అనునయంగా, శ్యామల ముఖం పక్కకి తిప్పుకొని "ఏం లేదండీ! పొద్దుటి నుంచీ కొంచెం తలనొప్పిగా ఉంది. అంతే" అన్నది. మళ్ళీ ఆయనే "అక్కయ్య వచ్చి వెళ్ళిందటగా. పిల్లను తీసికెళ్ళిందటగా. ఏం?" అన్నారు. ఆ మాట వింటూనే శ్యామల కంఠం దుఃఖంతో నిండిపోయింది. కళ్ళు నీళ్ళతో నిండిపోయినై. అది గమనించిన పి.ఏ. వెంటనే మాట మార్చేసి "చూడమ్మా, ఆ కో-ఆర్డినేషన్ మీటింగ్‌కి ఫైలు తయారు చేయాలి. ఈసారి నీచేత చేయిస్తాను. నీకూ నేర్చుకొన్నట్లు ఉంటుంది. నీ రైటింగ్ సులభంగా అందరూ చదవగలరు!" అంటూ డ్రాయర్లోంచి తెల్లకాగితాలు ఫైలు తీసి శ్యామల ముందు పెట్టేరు. ఆయన వయస్సులో పెద్ద. తండ్రిలా గౌరవించదగిన వ్యక్తి. అందువల్ల శ్యామల కాదనలేక కూర్చుంది. ఒక వైపు ఫైలు చెపుతూనే శ్యామలను ఓదారుస్తూనే మందలించారు, అక్కయ్య చిట్టిని తీసుకెళ్ళిపోయిందని బెంగపెట్టుకోకూడదని, ఆయన దగ్గరుండే మంచిగుణమే అది. ఎట్లాంటి వాళ్ళను ఎలా లొంగదీయ్యాలో తెలుసుకొని పనిచేయించే రకమని ఆఫీసులో అందరూ అనుకోవటం శ్యామలకి తెలుసు. శ్యామల కొద్దిగా తేరుకొన్నది. ఆయన డిక్టేటు చేసినది రాయటం పూర్తిచేసేసరికి అయిదయిపోయింది.

ఫైలు పూర్తి చేసిన శ్యామల చక చకా కాగితాలు సర్దేసి ఫైలు పాడ్‌లో కట్టేసి లేచి నిల్చుంది. పి.ఏ. కుర్చీలో వెనక్కి జేరబడుతూ "ఆ ఫైలు ఇక్కడే పెట్టేసి వెళ్ళమ్మా! నేను మరోసారి చూసుకొంటాను" అన్నారు. శ్యామల "నే వెళ్ళుతున్నానండీ!" అంటూ బయల్దేరింది. ఆయన నవ్వుతూ "వెళ్ళి వస్తాననమ్మా!" అను ఏమిటో ఈ కాలపు కుర్రాళ్ళంతా ఇంతే!" అన్నారు. మరొక్కప్పుడైతే శ్యామల జవాబు చెప్పేదికాని మనస్సు బాగులేక ఒంట్లో ఓపికలేక తలవంచుకొని సెక్షనుకి వెళ్ళిపోయింది. టేబిలుమీద ఫైళ్ళన్నీ బీరువాలో పెట్టేసింది.

టేబిలునిండా గుట్టలు గుట్టలుగా ఫైళ్ళు పెట్టుకొనికూర్చున్న సూపరింటెండెంటు తో "నే వెళ్ళుతున్నానండీ!" అన్నది. ఆయన తల ఎత్తకుండానే "మంచిదమ్మా! చెయ్యండి! చెయ్యండి!" అన్నారు.

శ్యామల బస్సుస్టాపు చేరుకొన్నాక టైము చూసుకొంది. ఐదు పదిహేను డైరెక్టు బస్సు వెళ్ళిపోయినట్లుంది. శ్యామలకు కాళ్ళు లాగుతున్నై, కళ్ళు మండుతున్నై. బస్సులు వరుసగా వస్తూ ఉన్నై. కానీ ఒక్కటి ఖాళీలేక ఆపటంలేదు. ఎలాగో బస్సు ఒకటి ఆగింది. క్యూ ముందుకు పోతూంది. ఎలాగో శ్యామల వరకు వచ్చింది. ఎక్కింది. అదృష్టం! డైరెక్టుబస్సే. లేడీస్ సీటునిండా మొగవాళ్ళు కూర్చున్నారు. శ్యామలను చూచి మూలన కూర్చున్న వాళ్ళిద్దరు లేచి నిలబడ్డారు. "అమ్మయ్యా!" అనుకొని కూర్చుంది. ఒళ్ళంతా వేడెక్కి నొప్పులుగా ఉంది. తల నొప్పి తగ్గలేదు. జ్వరం వస్తుందో ఏమో! ఎలాగో ఇల్లు చేరుకుంటే చాలు!" అనుకుంది. బస్సు కాలనీ చేరుకొన్నది.

శ్యామల నెమ్మదిగా ఇల్లు చేరింది. మెట్లెక్కుతుంటే లోపల్నుంచి నాన్న మాటలు వినబడుతున్నై. "ఏమే! చిన్న ఇంకా రాలేదు. ఈ బస్సులో దిగిందేమో చూడు!" అంటూ. శ్యామలను చూడగానే తండ్రి ముఖం వికసించింది. "నీకు నూరేళ్ళమ్మా!" అంటూ "అరే! అలా ఉన్నావేం? ముఖం వాడిపోయిందే! జ్వరంగాని రాలేదుకదా! అని నుదుటిమీద చెయ్యేసి "అబ్బా జ్వరం వచ్చింది, రా! పడుకో!" అన్నారు. శ్యామల బలవంతంగా నవ్వి "ఫరవాలేదు నాన్నా! కొద్దిగా తలనొప్పి, ఒళ్ళు నొప్పులు!" అని గదిలోకి వెళ్ళిపోయింది. ఆ మాటలు విని శ్యామల తల్లి కాఫీ గ్లాసు పట్టుకొని గదిలోకి వెళ్ళింది. అప్పటికే శ్యామల చీరన్నా మార్చకుండా మంచంమీద పడుకుంది. కాళ్ళూ, చేతులూ తోటకూర కాడల్లా వేలాడిపోతున్నై. అమ్మ హడలిపోయింది. తువాలు తడిపి తెచ్చి ముఖం, కాళ్ళు, చేతులూ తుడిచి శ్యామలచేత కాఫీ తాగించారు. ఇదంతా గమనిస్తున్న శ్యామల నాన్న తన ఆలోచనలు కట్టిపెట్టి భార్యతో "నువ్వు ఇక్కడే కూర్చో! నేను డాక్టరు గారిని తీసుకొస్తాను!" అంటూ షర్టు వేసుకొని బయటికి వెళ్ళిపోయారు.

మర్నాడు తెల్లవారేవరకూ శ్యామలకు తెలివి రాలేదు. కళ్ళు తెరిచేసరికి దగ్గర కూర్చుని తలమీద తడిగుడ్డ వేస్తున్న నాన్న, ఎఱ్ఱటి కళ్ళతో, శ్యామల చేతిని తనచేతిలో పెట్టుకొని

కూర్చున్న అమ్మ కనిపించారు. అమ్మ ప్రక్కనే కళ్ళనీళ్ళు తుడుచుకొంటూ నిలబడ్డ అక్కయ్య కనిపించేసరికి, శ్యామల ఒక్క ఉదుటున "చిట్టి ఏదీ?" అంటూ లేవబోయింది. "ఇదిగో! నీలాగే జ్వరం! 'చాం పిన్ని' అని కలవరిస్తోంది" అంటూ బావగారు చిట్టిని తీసికొచ్చి శ్యామల పక్కలో పడుకోబెట్టారు. "చిట్టి తిరిగి వచ్చేసింది!" అనుకొంటూ చిట్టిమీద చెయ్యివేసుకొని కళ్ళు మూసుకొని పడుకుంది. అప్పుడే వచ్చిన డాక్టరుగారు శ్యామల నాడి చూసి తృప్తిగా నవ్వారు. "ఇక ఫర్వాలేదు. తొందర చెయ్యకండి! బాగా విశ్రాంతి కావాలి. గంట గంటకి హార్లిక్సో, పళ్ళ రసమో ఇవ్వండి, చంటి పిల్లకీ అంతే! జ్వరం ఇక తగ్గిపోతుంది. ఇద్దరికీ బెంగవల్లె వచ్చింది. నేను మళ్ళీ సాయంత్రం వచ్చి చూస్తాను!" అన్నారు డాక్టరుగారు.

శ్యామల తండ్రి "నిన్న రాత్రి చాలా భయంవేసింది. మీరు వచ్చి ఇంజక్షన్ ఇచ్చేక ధైర్యం వచ్చింది. మా శ్యామల ఉత్త అమాయకురాలు. ప్రేమ, అభిమానం, దయ అన్నీ దాని హృదయం నిండా ఉన్నాయి!" అంటూ కళ్ళ నీళ్ళు తుడుచుకొని డాక్టరుగారిని సాగనంపారు. ఇంట్లో అందరి మనస్సులు తేలికపడి హాయిగా నవ్వుకున్నారు.

-: o o o :-

# నీతి నిలిపిన జెండా

సాయంత్రం అయిదున్నరయింది. ఆఫీసుల్లో, కంపెనీల్లో, ఫ్యాక్టరీలలో పనిచేసేవారంతా ఇళ్లకు చేరటానికి తహతహలాడే సమయం. ధనవంతుల కుటుంబాలకు చెందిన స్త్రీలు కార్లలో షాపింగుకో, క్లబ్బులకో బయలుదేరేవేళ. రోడ్లు బస్సులతో, కార్లతో, మనుషులతో కళకళలాడుతున్నై. తెల్లవారితే ఆగస్టు పదిహేనో తేది. ఊరంతా లైట్లతో, జెండాలతో అలంకరిస్తున్నారు.

పోస్టాఫీసుకి కూడా జండాలు అవీ కడుతున్నారు. పోస్టుమేన్‌లు అందరూ బట్వాడా చేయగా మిగిలిన ఉత్తరాలనీ, బంగీలను పోస్టాఫీసులో అప్పచెప్పి టోపీలు తీసేసి, జేబుల్లో పెట్టేసుకుని తలలు దువ్వుకుని ఇళ్లకు పోవటానికి సిద్ధమౌతున్నారు. నైట్‌షిఫ్ట్‌వాళ్ల సందడి మాత్రం కొద్దిగా వినిపిస్తున్నది.

ఆ పెద్ద భవనంలో పోస్టుమాస్టరుగారి గది ముందు నైటువాచరు, ప్యూను నెమ్మదిగా మాట్లాడుకుంటున్నారు. లోపల పెద్దలైటు వెలుగుతోంది. ఫాన్ తిరుగుతోంది. పోస్టు మాస్టరు విశ్వనాథంగారు ఎకౌంటు పుస్తకాలు ముందు పెట్టుకుని ఎర్ర సిరాతో సరిచూసుకుంటూ సంతకాలు పెడుతున్నారు. ఆయన వయస్సు యాభై పైనే ఉంటుంది. నీటుగా వేసుకున్న తెల్లటి బట్టలూ, నెరసిన జుట్టు, శాంతంగా కనపడే ముఖం చూస్తే అందరికీ గౌరవభావం కలుగుతుంది. ఆ వూరికి బదిలీ అయిన సంవత్సరంలోగానే కింది ఉద్యోగుల గౌరవం, అభిమానం సంపాదించగలిగారు.

ఆయన ఎదురుగా సుకుమార్ కూర్చున్నాడు. అతను ఆ ఆఫీసులోనే టౌను ఇనస్పెక్టరు. అతివాది, మహోదుడుకు. ఆఫీసులో సుకుమార్‌ని పోస్టుమాస్టరు విశ్వనాథంగారి ప్రియకుమారుడని అనుకోటం కద్దు. అట్లాంటివి విశ్వనాథంగారు వినీ విననట్లు నవ్వుకుని ఊరుకుంటారు. బాగా పనిచేస్తాడని అతనంటే అభిమానం. మిగతావాళ్ల దగ్గర ఎట్లా ప్రవర్తించినా పోస్టుమాస్టరు విశ్వనాథంగారి దగ్గర మాత్రం వినయంగా గౌరవంగా ప్రవర్తిసాడు. ఆయన మాట కాదనలేదు. ఇవాళ విశ్వనాథంగారి ఎదుట కూర్చున్నా అతని ముఖంలో

తీవ్రత కనపడుతోంది. విశ్వనాథంగారు తన పనిలో మునిగిపోయి తల ఎత్తటంలేదు. సుకుమార్‌కి విసుగెత్తిపోయింది. ఇక ఆగలేకపోయాడు.

"ఏమిటి సార్! ఈ సంవత్సరం మీ ప్రోత్సాహం వల్ల స్వాతంత్ర్య దినోత్సవం బాగా జరుపుకోవాలనుకున్నాం. ఏర్పాట్లు కూడా చేసుకున్నాం. ఇంతకీ పతాకావిష్కరణకి ఎవరినీ పిలవలేదు. మీరేమో ఈ కాగితాల్లో మునిగిపోయి కూర్చున్నారు. నాకేం చెయ్యాలో తోచటం లేదు" అన్నాడు. ఆయన నవ్వుతూ తల పైకెత్తి "ఫరవాలేదులెండి. నైట్ షిఫ్ట్‌కి బాయ్ మెసింజెరు సుబ్బయ్య వస్తాడుగా - అతనిచేత వెంకటేశ్వర్లుకి కబురు పెడదాం, పతాకం ఎగర వెయ్యటానికి ఉదాయాన్నే రమ్మని!" అన్నారు.

ఆ మాట వినేసరికి సుమార్ తెల్లబోయాడు. ఒక్కసారి దూకుడుగా "ఏమిటి సార్, మీరు? మొన్న రిటైరైన ఆ పోస్టుమాన్ వెంకటేశ్వర్లా పతాకావిష్కరణ! మీరు మరీ ఆర్భాటం చెయ్యవద్దంటే మాకు సగం ఉత్సాహం తగ్గిపోయింది. పోనీ 'మనలో మనమే చేసుకుందాం' అన్నారు. సూపరెంటెండెంటు గారిని పిలుస్తారేమో అనుకున్నాం. మధ్యలో ఈ ముసలాడెందుకు? అందులో రిటైరయినాడు కూడా. లేకపోతే ఆ పనికి మీరే వప్పుకోండి. ఎలాగా మాస్టరుగారి కుమారుడని నామీద ఆఫీసులో ఏడుస్తున్నారు. నిజంగా మీరు పతాకం ఆవిష్కరిస్తే ఈ సుకుమార్ చప్పట్లు కొట్టి స్వాతంత్ర్య దినోత్సవం జయప్రదంగా జరిపించేస్తాడు!" అంటూ లేచి నుంచున్నాడు. అతని ముఖం కోపంతో ఎఱ్ఱబడింది.

అది విన్న విశ్వనాథంగారు పైకి కనపడనీయకపోయినా ఎఱ్ఱబడిన సుకుమార్ ముఖం, చెవులు చూసి కోపం వచ్చిందని గ్రహించారు. శాంతంగా చిరునవ్వుతో "ఇదిగో ఒక్క నిమిషం ఈ పుస్తకం ఒక్కటీ చూసేస్తాను. కూర్చోండి" అన్నారు. సుకుమార్‌కి ఒళ్లు మండిపోయింది, తనడిగినదానికి సమాధానం చెప్పకుండా కూర్చోమన్నందుకు. అదే ఇంకొకరయితే కొట్టినంత పనిచేసేవాడు. కాని చెప్పినది సుపీరియర్ గెజిటెడ్ పోస్టుమాస్టరు. అదీకాక విశ్వనాథంగారు అనవసరంగా చుట్టూ మనుషులను కూర్చోపెట్టుకొనే రకం కాదు. ఆయన ముఖం చూస్తే అతి దుడుకువాడైన సుకుమార్ కూడా పిల్లిలా ఆయన చెప్పిన పనులు పూర్తి చేస్తాడు. సుకుమార్ ముఖం కందగడ్డలా పెట్టుకుని కూర్చున్నాడు విశ్వనాథంగారి ఎదురుగా.

మరో అయిదు నిముషాల్లో విశ్వనాథంగారు కాగితాలు చూడటం ముగించి లేచారు. "ఒక్క క్షణం మేడమీదకి రండి!, మాట్లాడదాం" అంటూ జవాబుకు ఎదురుచూడకుండా అతని బుజం మీద చెయ్యి వేసి మేడమీదికి నడిచారు. చేసేదిలేక సుకుమార్ తలవంచుకుని ఆయనతోపాటే వెళ్లాడు. హాల్లో కూర్చుని విశ్వనాథంగారు "రాజా!" అంటూ కేకేశారు. "ఆ వస్తున్నా" అంటూ గబగబా వచ్చిన అమ్మాయి తండ్రితో మరో వ్యక్తి ఉండటం చూసి ఆగిపోయింది గుమ్మం దగ్గరే విశ్వనాథంగారు నవ్వుతూ "కొత్తవాళ్లెవరూ కాదమ్మా! సుకుమార్. మీ అన్నయ్యల్లాంటి మరో అన్నయ్య. అమ్మేది, ఒక్కసారి రమ్మను" అన్నారు. ఆ అమ్మాయి నవ్వుతూ "ఏం తోచకపోతే అమ్మా, నేను కేరమ్స్ ఆడుతున్నాం నాన్నా! ఇవాళ అమ్మ కళ్లజోడు దాచేశాను, అంచేత ఓడిపోతోంది!" అని లోపలికి వెళ్లిపోయింది. విశ్వనాథంగారు "సుకుమార్! ఈ అమ్మాయే మా రెండో అమ్మాయి, ఆఖరమ్మాయి కూడా. పేరు రాజామణి. బి.ఎ పాసయి సెక్రెటేరియట్‌లో పనిచేస్తోంది. పెద్ద అమ్మాయికి పెండ్లయింది. వాళ్లు డెహ్రాడూన్‌లో ఉంటున్నారు. పెద్దబ్బాయి విశాఖలో హౌస్ సర్జన్ చేస్తున్నాడు. చిన్నవాడు బెనారస్‌లో ఎం.ఎ చేస్తున్నాడు. మా రాజా పెళ్లిచేస్తే నేను నిశ్చింతగా రిటైరవచ్చు" అన్నారు.

విశ్వనాథంగారి భార్య విశాలాక్షమ్మగారు వచ్చి భర్త పక్కనే కూర్చున్నారు. విశ్వనాథంగారు భార్యతో "వీరు సుకుమార్. టౌన్ ఇనస్పెక్టరు ఇవాళ మనింట్లో భోజనం చేస్తారు. అయిదు నిమిషాల్లో పెట్టెయ్యాలి" అన్నారు. సుకుమార్ "అబ్బే వద్దండీ! భోజనానికి ఇంటికి వెళ్తాను" అంటూ ఇబ్బందిగా ముఖం పెట్టుకుని కూర్చున్నాడు. ఆమె "దానికేమిటండీ! మనలో మనకి మొహమాటం పనికిరాదు. ఇవాళ ఇక్కడ భోంచేసి వెళ్లాల్సిందే! నా ఆలస్యం ఉండదు. మీ మాస్టరుగారే భోజనానికి 'అయిదు నిమిషాల్లో వస్తున్నాను!' అంటే అయిదు గంటలు చేస్తారు" అని లోపలికి వెళ్లిపోయారు.

విశ్వనాథంగారు బట్టలు మార్చుకుని వచ్చి పడక్కుర్చీలో తీరికగా కూర్చున్నారు. సుకుమార్ ముఖం మారిపోయింది. బుంగమూతి పెట్టుక్కూర్చున్నాడు. విశ్వనాథంగారు తీరిగ్గా కుర్చీలో వెనక్కి చేరబడి "సుకుమార్! మీకు రేపటి కార్యక్రమం గురించి నామీద బాగా కోపం వచ్చినట్లుంది. నేను చెప్పేది వినండి. అది విన్నాక కార్యక్రమం మీ ఇష్టప్రకారమే జరిపిద్దురుగాని" అన్నారు. సుకుమారు తగ్గిపోయాడు. తన కుర్చీ ఆయన కుర్చీకి దగ్గరగా జరుపుకుని ఆతృతగా "చెప్పండి సార్! మీ మాట కాదన్న దెప్పుడు?" అన్నాడు.

విశ్వనాథంగారు చెప్పదలచినది మొదలు పెట్టబోయేసరికి భోజనానికి పిలుపు వచ్చింది. ఆయన "సరే రండి, భోజనం అయ్యాక చెప్పుకోవచ్చు!" అంటూ కూతురందిచ్చిన తువ్వాళ్లు అందుకున్నారు. అంతా ఒకేసారి భోజనాలకి కూర్చున్నారు. విశ్వనాథంగారి భార్య సుకుమార్ ఎక్కడ మొహమాటపడతాడోనని ఆప్యాయంగా కబుర్లు చెబుతూ కొసరి కొసరి వడ్డించారు. సుకుమార్ విశ్వనాథంగారివైపు చూసి "మాస్టారూ! మీతో ఒక్కమాట చెప్పాలని అనుకుంటున్నాను. మీరిక్కడికి వచ్చి సంవత్సరమయింది. నన్ను ఎంతో ఆప్యాయంగా చూసుకుంటున్నారు. నన్ను మీరు 'ఏమండీ!' అంటూ నన్ను మన్నించడం ఏమీ బాగులేదు నాకు" అన్నాడు. దానికాయన నవ్వుతూ,"ఓస్ ఇంతేనా! మావైపు ఈ మర్యాదలూ మన్ననలూ ఎక్కువ. మా కుటుంబాల్లో మరీను. అయినా మన్ననగా పిల్చినంతమాత్రాన ఆప్యాయత, చనువు ఎప్పుడూ తగ్గవు. మిమ్మల్ని మా అబ్బాయిల్లో ఒకరిగానే భావిస్తున్నాం" అన్నారు. భోజనాలు ముగించి చేతులు కడుక్కున్నారు. విశ్వనాథంగారు చెయ్యి తుడుచుకుంటూ కూతురితో "వక్కపొడి తెచ్చి పెట్టమ్మా, నాకూ అన్నయ్యకూ" అని హాల్లోకి వెళ్లారు. సుకుమార్ ఆయన వెంటే నడిచాడు.

ఇద్దరూ హాల్లో కూర్చున్నారు. విశ్వనాథంగారు వక్కపొడి వేసుకుని కథ మొదలుపెట్టారు:

"నా చదువు పూర్తయింది. ఉద్యోగం కోసం ప్రయత్నించే రోజులు. మా నాన్న స్కూలు మాస్టరు చేసేవారు. నేను, చెల్లాయిలిద్దరూ. వెనక ఆస్తి ఏమీ లేదు. నాన్న జీతంలోనే అమ్మ గుట్టుగా సంసారం నడిపేది. ఏమాత్రం అదనపు ఖర్చు అవసరమైనా ఆర్థికంగా కష్టపడేవాళ్లం. నాకు ఉద్యోగం దొరికితే నాన్నకు అండగా ఉండవచ్చని అనుకునేవాణ్ణి. ఒకరోజు హఠాత్తుగా విశాఖపట్నం ఉద్యోగానికి ఇంటర్వ్యూ రమ్మని పిలుపు వచ్చింది. ఆ రిజిష్టరు కవరు తెచ్చిన పోస్టుమేన్ ఖాదర్ మొదటినుంచీ మా కుటుంబాన్ని తెలిసిన వాడు ఆ కవరు విప్పి చూసి దిగులుగా కూర్చున్నాను. "ఏమిటి బాబూ!" అనడిగాడు ఖాదరు. "ఉద్యోగానికి ఇంటర్వ్యూకి రమ్మని పిలుపు వచ్చింది ఖాదర్! మీ డిపార్టుమెంటులోనే!" అన్నాను. "సంతోషంగా ఉంటానికి బదులు దిగులుపడ్డారేంటి బాబూ! మీరు చేతికందివస్తే పెద్దబాబుగారికి సహాయం అవుతారు. చెల్లాయిలకి పెళ్లిళ్ల చెయ్యాలి" అన్నాడు. నేను "అదికాదు ఖాదర్! నాన్న ఊళ్లో లేరు" అన్నాను. ఖాదర్ వెళ్లిపోయాడు.

నాన్న ఊళ్లో లేరు. అమ్మదగ్గర డబ్బు లేదు. నాకు ఇంటర్వ్యూకి వెళ్లిరావడానికి అయిదు రూపాయలన్నా కావాలి. వెంటనే లేచి బాబాయిగారింటికి వెళ్లాను. ఆ రోజుల్లో ఆయన ఏదో కంపెనీలో నెలకి వంద రూపాయలు సంపాదించేవారు. పిల్లల్లేరు. వెళ్లేసరికి ఇంటిలోనే ఉన్నారు. సగం బాధపడుతూనే విషయం చెప్పాను. "అబ్బే ఏదీ, నా దగ్గరా లేదురా! ఈ నెల అనుకోకుండా చాలా ఖర్చయింది" అంటూ జాలి ముఖం పెట్టారు. ఆయన దగ్గరున్నా, పిన్ని భయం వల్ల ఇవ్వలేరు. ఇవ్వరని తెలుసు. తరవాత మేనమామ ఇంటికి వెళ్లాను. నెమ్మదిగా నాన్న ఊళ్లో లేకపోవడం. ఇంటర్వ్యూకి పిలుపు వచ్చిన సంగతి చెప్పాను. రేపే వెళ్లాలని కూడా చెప్పాను. ఆయన ముక్తసరిగా "పోస్టల్‌లోనా? మంచిదేగా, వెళ్లు" అన్నారు. నేను జవాబు చెప్పకుండా ఇంటికి వచ్చేసి ఆలోచిస్తూ కూర్చున్నాను. ఇంటర్వ్యూ సంగతి అమ్మకి చెప్పి లాభం లేదనుకున్నాను. ఆమె దగ్గర డబ్బు లేదు. ఇంటర్వ్యూకి వెళ్లాలని చెపితే బాధపడుతుంది. ఏ స్నేహితుడినైనా అడుగుదామంటే, నాకు సన్నిహితంగా ఉండే వాళ్లిద్దరే. ఇద్దరూ పైఊళ్లల్లో చదువుతున్నారు. తెలిసినవాళ్లని అడగటానికి అభిమానం అడ్డువచ్చింది. అలాగే సాయంత్రంవరకూ పరధ్యాన్నంగా తిరిగాను. అమ్మ మధ్యాహ్నం భోజనం దగ్గర అడిగింది, "ఏంరా! ఒంట్లో బాగులేదా యేం, అన్నం కెలుకుతూ కూర్చున్నావు!" అని. "ఏం లేదులే అమ్మా!" అని లేచి వచ్చేశాను.

సాయంత్రం అయింది. అరుగుమీద పుస్తకం పట్టుకుని కూర్చున్నాను. పుస్తంమీద దృష్టిలేదు. పుస్తకం మూసేసి ఎదురుగా ఆడుకుంటున్న పిల్లల్ని చూస్తూ కూర్చున్నాను. పోస్టుమేన్ ఖాదర్ హుసేన్ వచ్చి "బాబూ!" అని పలకరిస్తే తుళ్లిపడ్డాను. ఎందుకంటే, అతను డ్రెస్‌లో లేడు. తెల్లటి పంచె, చొక్కా, తువాలు. నేను "ఏమిటోయ్, ఇలా వచ్చావు?" అని అడిగాను ఆశ్చర్యపోతూ. అతను జేబులోనుంచి అయిదు రూపాయల నోటు తీసి, నా చేతిలో పెట్టి "ఇంటర్వ్యూకి వెళ్లిరండి బాబూ!" అన్నాడు. నేను తెల్లబోయి "ఖాదర్!" అన్నాను. అతను నవ్వుతూ "మీకు తప్పక ఉద్యోగం వస్తుంది బాబూ! మా బాబు పెద్ద పోస్టుమాస్టరైపోడూ!" అని నవ్వాడు. నాకు కళ్లనిండా నీళ్లు తిరిగాయి. నేను సంభ్రమాశ్చర్యాలనుంచి తేరుకోక ముందే ఖాదర్ "వస్తా బాబూ!" అంటూ వెళ్లిపోయాడు.

రాత్రి భోజనాల దగ్గర అమ్మతో "రేపు నన్ను తెల్లవారుజామునే లేపమ్మా! విశాఖపట్నం వెళ్లాలి!" అన్నాను. అమ్మ ఆశ్చర్యంగా 'ఎందుకు? ఏమిటి, ఈ అనుకోని ప్రయాణం?'

అన్నది. 'ఊరికే కాదమ్మా! ఉద్యోగానికి ఇంటర్వ్యూకి రమ్మని పిలుపు వచ్చింది!' అన్నాను. అమ్మకి అప్పుడే నాకు ఉద్యోగం వచ్చినంత సంతోషం. అమ్మ వివరాలు అడుగుతుంటే ఆ.. ఊ.. అంటూ సమాధానం చెప్పి, ఒక జత ఇస్త్రీ బట్టలు సంచిలో పెట్టుకున్నాను. కావలసిన సర్టిఫికెట్లు జాగ్రత్తగా చూసి పెట్టుకున్నాను. ఎందుకంటే - నాన్న ఊళ్లో లేరు. ఆయన ఉంటే ఇవన్నీ శ్రద్ధగా చూసి హెచ్చరిస్తారు.

మర్నాడు ఉదయమే విశాఖపట్నం వెళ్లి మూడో రోజు ఇంటికి చేరుకున్నాను. అప్పటికి నాన్న ఊరి నుంచి వచ్చేరు. ఆయనకి పిల్లల్ని ఆప్యాయంగా, స్నేహితుల్లా చూడటం అలవాటు. నన్ను చూస్తూనే "అడుగో, మా దొర వచ్చేశాడు. ఏం నాన్నా! ఇంటర్వ్యూ ఎలా చేశావు? ఎందులో? ఏమిటి?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించారు. నేను వివరంగా అన్నీ చెప్పాను. డబ్బు గురించి నేను పడిన ఆందోళన, ఖాదరు సర్దుబాటు చేసిన సంగతి కూడా చెప్పాను. నాన్న పక్కకితిరిగి కళ్లు తుడుచుకున్నారు.

సాయంత్రం ఖాదరు వచ్చి "బాబుగారూ, నమస్కారం!" అంటూ ఉత్తరాలు పడేసి వెళ్లిపోతుంటే వెనక్కి పిల్చి అయిదు రూపాయలు తెచ్చి ఇచ్చేశాను. మళ్లీ "ఖాదర్! నీకు ఎలా కృతజ్ఞత చెప్పాలో తెలియటం లేదు. నేను ఇంటర్వ్యూకి వెళ్లివచ్చాను" అని చెప్పాను. అతను నవ్వుతూ "దాని కేమిటి బాబూ! మీరు తప్పక సెలక్టవుతారు!" అంటూ వెళ్లిపోయాడు.

తరవాత మరో నెల రోజులకి మా ఊళ్లోనే ఉన్న పోస్టాఫీసులో క్లర్కుగా చేరమని ఆర్డర్లు వచ్చాయి. వెళ్లి చేరాను. . . . . . . .

తరువాత కొన్ని సంవత్సరాలు గడిచిపోయాయి. నేను పరీక్షలు పాసయి ఉద్యోగంలో ప్రమోషన్లు పొందగలిగాను. నాన్న రిటైరయ్యారు. చెల్లాయిలిద్దరూ పెళ్లిళ్లయి అత్తవారిళ్లల్లో సుఖంగా ఉన్నారు. అమ్మా, నాన్నా ఏ దిగులూ లేకుండా నా దగ్గరే ఉండేవారు. నేను బదిలీల వల్ల ఎన్నో ఊళ్లు తిరిగాను. మా ఊరికే హెడ్‌పోస్ట్‌మాస్టరుగా వేశారు. నేను వెళ్లేసరికి ఖాదర్ రిటైరయి వాచ్‌మేన్‌గా పనిచేస్తున్నాడు. ఆ ఆఫీసులోనే క్లర్కుగా పనిచేసి ఆ ఆఫీసుకే పోస్టుమాస్టరుగా వెళ్లటం నాకు సంతోషంగా ఉండేది. నేను మొట్టమొదట ఉద్యోగంలో చేరడం వల్ల ఆ ఆఫీసన్నా, ఆ ఊరన్నా అభిమానం ఎక్కువగా ఉండేది. నన్ను రిలీవ్ చేసిన పోస్టుమాస్టరు ఆఫీసులో అందరినీ పరిచయం చేశారు. "ఖాదర్ హుస్సేన్! పోస్టుమేన్‌గా రిటైరయ్యాడు.

వాచ్‌మేన్‌గా పనిచేస్తున్నాడు!" అని ఖాదర్‌ని పరిచయం చేసేసరికి సంతోషంతో మాటరాక అతను పెట్టిన నమస్కారం అందుకోటంకూడా మరచి ఖాదర్‌నే చూస్తూ ఉండిపోయాను. "పెద్దవాడయిపోయినా ఆ ముఖంలోని చిరునవ్వు, ఆప్యాయత మారలేదు, తెల్లటి గడ్డం, ముడతలు పడిన ముఖం, ముడుతలు పడి తెల్లగా పొడుగ్గా ఉన్న చేతులు. ఆ చేతులు ఎంతమందికి ఉత్తరాలు పంచిపెట్టాయో, ఎంతమందికి సహాయం చేశాయో! నా ఆలోచనలు నాలోనే అణచుకున్నాను. పూర్తిగా ఛార్జీ అప్పచెప్పుకోటం అయ్యేసరికి పొద్దుపోయింది. పోస్టాఫీసు మేడమీదే క్వార్టర్సు. నేను మేడమీదికి వెళ్లేసరికి నాన్న ఈజీఛైర్లో కూర్చున్నారు. పక్కనే ఖాదర్ నుంచుని మాట్లాడుతున్నాడు. నన్ను చూడగానే సంతోషంతో "బాగున్నావా బాబూ!" అని అప్యాయంగా పలకరించాడు. అతనికి సంతోషంతో కళ్లల్లో నీళ్లు తిరిగాయి. నాకూ ఆ అనుభూతి కలిగింది.

ఖాదర్‌ని ఎప్పుడూ మనస్సులో గౌరవించేవాణ్ణి. తన డ్యూటీ అయిపోయాక, సెలవురోజుల్లో ఇంటికి వచ్చి కబుర్లు చెప్పేవాడు. అతనిపిల్లలంతా ప్రయోజకులై, తండ్రిని పనిచెయ్యవద్దంటారట. కాని తనలో శక్తి ఉన్నంత వరకూ ఊరికే ఉండలేనంటాడు ఖాదర్. నా పిల్లలంతా "ఖాదర్ తాత" అంటూ బుజాలమీదికెక్కి ఆడుకునేవారు. నా భార్యను 'విశాలమ్మా' అంటూ ఇంటికి కావలసిన వస్తువులు తేవడం, వగైరా బాధ్యతలన్నీ తీసుకున్నాడు. ఆ ఊళ్లో గడిచిన సంవత్సరం రోజులూ ఎట్లా గడిచాయో తెలియకుండానే జరిగిపోయాయి.

ఉన్నట్టుండి ట్రాన్స్‌ఫర్ ఆర్డర్లు వచ్చాయి. గెజిటెడ్ పోస్టు. కోయంబత్తూరు వేశారు ప్రమోషన్ వచ్చినందుకు సంతోషపడాలో, అలవాటయిన ఊరిని, మనుషుల్ని వదలి వెళ్లటానికి విచారించాలో తెలియలా! కాని తప్పదుగా! మామూలుగా ప్రయాణపు ఏర్పాట్లు అన్నీ చేసేశాను. మా ఆవిడకూ, అమ్మకూ, నాన్నకూ ఊరు వదిలి వెళ్లటం అంతగా ఇష్టంలేదు. అందులో ఒక్క సంవత్సరమే అయింది ఆ ఊరెళ్లి. కాని నేను అక్కడే ఉంచమని అడగటం ఇష్టపడనని తెలిసి, ఎవరూ పైకి మాట్లాడలేదు. పిల్లలు మాత్రం ఉత్సాహంగా ఉన్నారు.

ఆఫీసులో ఘనమైన వీడ్కోలిచ్చారు. రైలు స్టేషనుకి కూడా వచ్చి నా మెడ పూలమాలలతో నింపేశారు. అందరి వెనుక నుంచుని ఉన్న ఖాదరు దిగులు ముఖం నేను గమనించకపోలేదు. రైలు కదిలే ముందు ఖాదరు రైలు పెట్టెలోకి ఎక్కాడు. నా రెండు చేతులూ కళ్లకద్దుకుని "బాబూ! నన్ను మర్చిపోకు! ఈ ఊళ్లో ఈ ఆఫీసులోనే క్లర్కుగా

చేసి ఈ ఆఫీసునకే పెద్దాఫీసర్‌గా వచ్చినందుకు, ప్రమోషన్‌మీద వెళ్తున్నందుకూ నా కెంతో సంతోషంగా ఉంది. మళ్లీ ఈ ప్రాంతానికి ఎప్పుడొస్తారో? మీరు మళ్లీ వచ్చేసరికి నేను బ్రతికుంటానో లేదో! "అంటూ ఉత్తరీయంలో ముఖం దాచుకున్నాడు. నాకు దు:ఖంతో గొంతు పూడిపోయింది. మాట రావటం లేదు. కళ్ళనీళ్ళు ఆపుకొని ఖాదర్ చేతులు పట్టుకున్నాను. ఆయన చేతులు వణికిపోతున్నాయి.

గార్డు విజిల్ వేశాడు. ఖాదర్ గబుక్కున కళ్లనీళ్లు తుడుచుకుని "సుఖంగా వెళ్లిరండి బాబూ!" అంటూ అమ్మకీ, నాన్నకీ నమస్కరించాడు. రైలు దిగి కిటికీ దగ్గరకు వచ్చి "విశాలాక్షమ్మా! జాగ్రత్త! దూర దేశం వెళ్తున్నారు. శాంతమ్మా! రాజమ్మా! పెదబాబూ! చినబాబూ! బాగా చదువుకోండి" అంటూ వెనక్కి తిరిగి గబగబా నడుచుకుంటూ వెళ్లిపోయాడు. రైలు ముందుకు సాగిపోయింది, సాగనంపవచ్చినవాళ్లంతా ఊపే చేతులను దూరంచేస్తూ.

తరవాత అయిదేళ్లకే అమ్మాయి పెళ్లికి మా ఊరెళ్లేసరికి ఖాదరు పాము కరిచి చనిపోయాడని తెలిసింది. అలాంటి మానవత్వం ఉన్నవాళ్లే దేశానికి కావాలి. స్వార్థపరులూ, డాంబికులుగా పెద్ద పదవులలో ఉన్న వారిని పిల్చి, పూలమాలలు వేసి, టైము లేదంటూ గంటల తరబడి ఉపన్యాసాలు చేసేవారిని, పతాకావిష్కరణకి పిలవటం నాకిష్టం లేదు.

ఏ పదవిలో ఉన్నా మానవత, ఆత్మగౌరవం, నిజాయితీ ఉన్నవారే పతాకాన్ని ఎగరేస్తేనే మనకి ఆత్మ సంతృప్తి, పతాకానికి గౌరవం చేకూర్చినవాళ్లవుతాం. ఆ రిటైరయిన వెంకటేశ్వర్లుని చూస్తే నాకు ఖాదరు జ్ఞాపకం వస్తాడు. వాళ్లు నిజాయితీగా తమ డ్యూటీని నిర్వర్తించి, డిపార్టుమెంటుకూ, దేశానికి సేవ చేశారు. వాళ్లని గౌరవించడం, మనల్ని మనం గౌరవించుకోవటం అన్నమాట. ఇప్పుడు చెప్పండి, పతాకావిష్కరణకి ఎవరిని పిలిస్తే బాగుంటుందో!' అంటూ కథను ముగించారు.

విశ్వనాథంగారు చెపుతున్న కథ ముగించడం సుకుమార్‌కి తెలియలేదు. కాస్సేపటికి తేరుకుని లేచి నిలబడ్డాడు. "నిజమే సార్! నేను ఈ ఊరు వచ్చినప్పటి నుంచి ఆ రిటైరయిన పోస్టుమేన్ వెంకటేశ్వర్లుని చూస్తున్నాను. డ్యూటీకి ఆలస్యంగా రావటంకాని ఎగ్గొట్టడంగాని చూడలేదు. పైగా అట్లాంటివాళ్లని మందలించడం విన్నాను. ఓవర్ టైం చేసి పేకాటలకి,

సినిమాలకి, త్రాగుడుకి ఖర్చు పెట్టేవాళ్లని ఆ డబ్బేదో ఇంటికి తీసికెళ్లి ఇంట్లో వాళ్లకోసం మంచిపనుల కోసం ఖర్చు పెట్టమని కోప్పడుతుంటాడు. నేను వెళ్తూ వెళ్తూ అతన్ని ఉదయమే పతాకావిష్కరణకి రమ్మని చెప్పి పోతాను. ఇంక నేను సెలవు తీసుకుంటాను! "అంటూ గబగబా వెళ్లిపోయాడు. విశ్వనాథంగారు అతను వెళ్లినవైపే చూస్తూ నుంచున్నారు.

తెల్లవారింది. పోస్టాఫీసు ఆవరణంతా శుభ్రం చేసి అలంకరించారు. స్టాఫ్ అంతా కలకల్లాడుతూ పతాకం చుట్టూ నిల్చున్నారు. సెలవు రోజు కూడా పొద్దున్నే రావలసి వచ్చిందని తిట్టుకుంటూ వచ్చినవాళ్లు లేకపోలేదు. విశ్వనాథంగారు తెల్లటి దుస్తులతో వచ్చి నుంచుని వెంకటేశ్వర్లుచేత పతాకావిష్కరణ చేయించారు. అక్కడి వాళ్లందరికీ ఆశ్చర్యం కలిగించిన విషయం ఏమంటే - విశ్వనాథంగారి భార్య కూడా వచ్చి పతాకం దగ్గర నుంచోటం. ఆమె బయటికి కనపడటం అరుదు.

తరవాత పోస్టుమాష్టరు విశ్వనాథం గారి ఇంటి నుంచి అందరికీ కాఫీ, ఫలహారాలు వచ్చాయి. ఉత్సాహంగా నవ్వుతూ తిరుగుతున్న సుకుమార్‌ని చూసి తృప్తిగా నవ్వుకున్నారు విశ్వనాథంగారు.

-:o o o:-

# సుడిగాలి

ఉదయం పది గంటలకే ఎండ మండిపోతున్నది. అప్పుడప్పుడు లేచిన దుమ్ము మనుషుల ముఖాలని చురుక్కుమనిపించి మరోచోటికి ప్రయాణిస్తోంది. గిరిజ బస్సు స్టాపులో నిలబడి టైము చూసుకుంటోంది. ఆమె ఇంటి దగ్గరే ఎక్కవలసిన మొదటి బస్సు తప్పిపోయింది. అందువల్ల ఇప్పుడు కూడా మామూలుగా ఎక్కే బస్సు వెళ్లిపోయింది. "ఇవాళ ఆఫీసుకి లేటే!" అనుకుంటూ మరోసారి టైము చూసుకుంది. పదిన్నర. ఇంకొక్క పది నిముషాల్లో ఆఫీసుకి చేరుకోవాలనుకుంది గిరిజ. మరొక్కసారి వేడిగాలి ఒక్క విసురు వచ్చి ఆమె చెంపల్ని తాకిపోయింది. ఆ గాలి వెనకే బస్సు. ఎలాగో జనాన్ని తప్పించుకుంటూ బస్సు ఎక్కింది.

ఆఫీసు చేరేసరికి అటెండెన్సు రిజిష్టరు ఆఫీసరు గదిలోకి పంపటానికి ప్రయత్నాలు చేస్తున్నాడు. ఎస్టాబ్లిష్మెంటులోని ఎల్‌డిసి. గిరిజ సంతకం పెట్టి ఊపిరి పీల్చుకుని సెక్షన్‌లోకి వెళ్లింది. సెక్షన్ అంతా నిశ్శబ్దంగా ఉంది. గిరిజ అల్మైరా తాళం తీసి ఫైల్సు టేబిల్ మీద పెట్టింది. మంచినీళ్లు తాగి ఫేన్ దగ్గర కూర్చుని సెక్షన్ అంతా కలియచూసింది. సెక్షన్ సూపరింటెండెంటు సుబ్బారావుగారు సీరియస్‌గా ఏదో ఫైలు చూసుకుంటున్నారు. ఆయన ముఖం చూస్తూనే గిరిజ "బయటి వాతావరణం లాగానే లోపల వాతావరణం కూడా చాలా వేడిగా ఉన్నట్టుంది'' అనుకుని పక్కకి చూసింది. రోజూ రాగానే పలకరించే సత్యనారాయణమూర్తికూడా పర్సనల్ రిజిష్టరు, కాగితాలు పరచుకుని సీరియస్‌గా కూర్చున్నాడు. గిరిజకి చిరాకేసింది - అందరూ సీరియస్‌గా ఆముదం తాగినట్లు ముఖాలు పెట్టుకుని కూర్చున్నందుకు.

గిరిజ కూడా పని మొదలుపెట్టింది. కాని "ఆఫీసు వాతావరణం పొద్దున్నే ఎందుకు వేడిగా మారిందో?" అని, కారణం తెలియక ఆలోచిస్తోంది. ప్యూన్ వచ్చి సూపర్నెంటుతో "అయ్యగారు పిలుస్తున్నారు సార్!" అని చెప్పిపోయాడు. ఆయన నడుం బెల్టు గట్టిగా బిగించుకుని ఆఫీసరుగారి గదిలోకి వెళ్లేరు. గిరిజ "హమ్మయ్య!" అనుకుని పక్కకి చూసింది.

సత్యనారాయణమూర్తి "మా బస్సులో రాలేదేం?" అనడిగాడు. గిరిజ నవ్వుతూ "అవునండి, కొద్ది క్షణాల్లో తప్పిపోయింది. అందువల్ల కొద్దిగా లేటు" అని, మళ్లీ "ఏమిటి సంగతి? మీ గురువుగారు ఇవాళ చాలా సీరియస్‌గా ఉన్నారు బయట ఎండ తీవ్రంగా ఉండడంవలనా ఏమిటి ఇక్కడ కూడా వాతావరణం వేడి వేడిగా ఉంది" అని నవ్వింది. అందుకు మూర్తి నవ్వుతూ "అప్పుడప్పుడు వడగాడ్పులు కూడా విసురుతున్నై ఎందుకో ఏమో! పొద్దున్నే వచ్చేసరికి బాగానే ఉన్నారు. ఒకసారి ఆఫీసరు గదిలోకి వెళ్లివచ్చి పది నిముషాలు అటూ ఇటూ హడావిడిగా తిరిగారు. అంతే! అప్పటి నుంచి ముఖం సీరియస్‌గా పెట్టుకుని కూర్చున్నారు. పైగా నేనూ, స్టెనో కూర్చుని మాట్లాడుకుంటుంటే నన్నేమనలేక అతన్ని పని చూసుకోమని కసిరారు. ఏమొచ్చిందో గొడవ!" అన్నాడు. గిరిజ నవ్వుతూ "ఏం లేదండీ! మీ గురువుగారికి అందరూ నవ్వుతూ పనిచేసుకోవటం, మాట్లాడుకోవటం నచ్చదు. అందరూ తనలాగే ఏడుపు ముఖంతో ఉండాలంటారు!" అన్నది. ఇద్దరూ పనిలో మునిగిపోయారు.

సత్యనారాయణమూర్తి యు.డి.సి ముక్కుకి సూటిగా పోతాడు. ఎవరికీ భయపడడు. చాలా చురుకుగా నేర్పుగా పనిచేసుకుపోతాడు. ఎవరికి ఏది తెలియకపోయినా చెపుతాడు. ఆఫీసరుగారి మేనల్లుడు. కాని కాస్తయినా గర్వం లేదు. అందరితో సరదాగా కబుర్లు చెబుతూ నవ్విస్తుంటాడు. గిరిజ ఉద్యోగంలో చేరిన కొత్తలో చాలా భయపడేది. ఉద్యోగానికి కొత్త. అందులో మొగవాళ్ల మధ్య కూర్చుని పనిచెయ్యాలనే భయం. మూర్తి గిరిజను ఆప్యాయంగా పలకరించేవాడు. ఏది తెలియకపోయినా చక్కగా చెప్పి చేయించేవాడు. గిరిజకూడా పని నేర్చుకుంది. చక్కగా అందరితో సహకరించటంవల్ల అందరి అభిమానాన్నీ సంపాదించుకుంది. మూర్తి గిరిజను "అమ్మాయ్!" అనేవాడు. గిరిజ కొత్తలో ఆశ్చర్యపడేది. తరువాత ఒక రోజు మూర్తి వివరించాడు, "మా జిల్లాలో చెల్లెళ్లని అమ్మాయ్ అని పిలవటం అలవాటు" అని. ఇవన్నీ ఆలోచిస్తూ గిరిజ పని చేస్తోంది.

సూపర్నెంటు గబగబా అడుగులు వేసుకుంటూ సెక్షన్‌లోకి రావటం చూసి అంతా సర్దుకున్నారు. ఆయన వచ్చి కుర్చీలో కూర్చుని ఏదో ఆలోచిస్తున్నారు. గిరిజ ఆయన ఆలోచించే విషయం ఏమిటో తెలుసుకోవాలని తనూ ఆలోచించింది. ఆఫీసరు ఏదైనా అర్జెంటు కాగితం విషయం అడిగారేమోనని. ఆఫీసరు ఏమైనా అని ఉంటారా? అనుకోడానికీ ఆస్కారంలేదు. వచ్చిన ఆఫీసర్లందరికీ ఇతనంటే ఇష్టం. ఏమీ అనరు.

కాస్సేపటికి టైపిస్టు వచ్చి టైపు చేసిన కాగితాలు బల్లమీద పెట్టాడు. ఆ కాగితాలు చూస్తూనే సూపర్నెంటు టైపిస్టు మీద విరుచుకుపడ్డారు. "ఏంటయ్యా! పొద్దుననగా ఇచ్చి చెయ్యమంటే ఇప్పుడా చెయ్యటం. అవతల ఛస్తుంటే!"

ఆ మాటవిని సెక్షన్‌లో అందరూ తలలెత్తారు. అవతల ఛస్తున్నదెవరో ఎవరికీ అర్థం కాలేదు. టైపిస్టు తల వంచుకుని నెమ్మదిగా "లేదు సార్! మీరియ్యగానే మొదలుపెట్టి చేశాను. మిషనే సరిగ్గా లేదు!" అంటూ ఏదో చెప్పబోయాడు. అతని మాట వినిపించుకోకుండానే "అదంతా నా దగ్గర చెప్పొద్దు, ఆఫీసరు దగ్గర చెప్పు!" అంటూ ఆ కాగితాలు పట్టుకుని చిన్న సైజు పరుగుతో సూపర్నెంటు సుబ్బారావుగారు ఆఫీసరు దగ్గరికి వెళ్లారు.

సెక్షన్‌లో ఈ హడావిడి చూసి నవ్వులు మొదలైనాయి. టైపిస్టు తెల్లముఖం వేసుకుని నుంచున్నాడు. మూర్తి లేచి వచ్చి అతని భుజం మీద చెయ్యేసి "డోంట్ వర్రీ బ్రదర్! మీరు ఆయన మాటలు పట్టించుకోకండి. ఇవాళ ఏదో చిరాకులో ఉన్నారు. మళ్లా కొద్దిసేపటికి ఆయనే సర్దుకుంటారు. మీకు కొత్త గనుక గాభరాపడుతున్నారు!" అని అనునయించి సీట్లోకి పంపేశాడు.

గిరిజ ఒక స్టేటుమెంటు తయారు చేస్తోంది. ఎక్కడో తప్పుచేసింది. అదువల్ల అంకెలు కుదర్లేదు. ఎన్నిసార్లు చేసినా ఎక్కడ పొరపాటు జరిగిందో తెలియటం లేదు. గిరిజ సత్యనారాయణ మూర్తికి చూపించింది. ఇద్దరూ కలిసి మరోసారి మొదటినుంచీ చూశారు. చివరకు గిరిజ చేసిన తప్పు మూర్తి చూపించాడు. గిరిజ స్టేటుమెంటు సరిచేసింది. ఇద్దరూ నవ్వుకున్నారు, "చేసిన తప్పు వెదకటానికి ఎంతసేపు పట్టిందో!" అని. సూపర్నెంటు సెక్షన్‌లోకి వచ్చారు. గిరిజ స్టేటుమెంటు ఆయన ముందు పెట్టింది. సంతకం పెట్టేశారు. టిఫిన్ టైమయింది. అంతా బయటికి వెళ్లిపోయారు; సూపర్నెంటు తప్ప. గిరిజ డ్రాయర్లోంచి టిఫిన్ డబ్బా తీసుకుని బయల్దేరింది. "ఏమ్మా గిరిజా!" అని పిల్చేసరికి ఆగిపోయింది. 'ఏంసార్!' అంటూ ఆయన టేబిల్ దగ్గర నిల్చుంది. ఆయన నసుగుతూ "ఆ సత్యనారాయణమూర్తితో జాగ్రత్తగా ఉండాలమ్మా! అతను ఆఫీసరు మేనల్లుడు!" అన్నారు. గిరిజ ముఖం కందిపోయింది. విసురుగా "ఏమిటి సార్, అట్లా అంటున్నారు! ఒక దగ్గర పనిచేస్తున్నాం. ఒక కుటుంబంలో వ్యక్తుల్లా ఉన్నాం మనం. ఆ స్టేటుమెంటు కుదరకపోతే

అతని సహాయం తీసుకుని చేశామ!" అంటూ సమాధానానికి ఎదురుచూడకుండానే వెళ్లిపోయింది.

లంచ్ నుంచి అందరూ తిరిగి వచ్చేసరికి మూసరెంటు సెక్షన్లో లేరు. గిరిజ సీరియస్గా పనిచేస్తోంది. కాని లోపల చాలా బాధపడుతోంది. "ఛీ! ఛీ! ఏం మనుషులు? ఏం ప్రపంచం? పాడు ప్రపంచం! పాడు మనుషులు! నవ్వుతూ మాట్లాడితేనే సహించరు. నా దురదృష్టం కాకపోతే ఈ ఎల్.డి.సి. ఉద్యోగానికెందుకు రావాలి? వచ్చినప్పటి నుంచీ చూస్తున్నాను. అతను ఏ విషయం తెలియకపోయినా చక్కగా చెప్తాడు. ఎంతో అభిమానంగా ఆప్యాయంగా మాట్లాడతాడు. తను కూడా ఆఫీసుకి వచ్చాక ఆడపిల్లననే విషయం మరచి సహ ఉద్యోగిలా వ్యవహరిస్తూ ఉంటుంది. అతన్ని అనలేక ఆ కోపం కూడా నా మీద కక్కినట్లుందనుకొని ఊరుకుంది.

మూడయింది. సుబ్బారావుగారు మీటింగుందంటూ ఫైలు పట్టుకుని ఆఫీసరుగారి దగ్గరకు వెళ్లారు. బయట జీపు కదిలిన శబ్దం విని సెక్షన్లో అంతా కాఫీలకని, సిగరెట్లకని బయటికి వెళ్లారు. సెక్షన్లో గిరిజ, మూర్తి మిగిలారు.

మూర్తి వచ్చి గిరిజకి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుని "అమ్మాయ్ గిరిజా!" అని పలకరించాడు. పరధ్యాన్నంగా ఉన్న గిరిజ తుళ్లిపడింది. మూర్తి నవ్వుతూ "ఏం అమ్మాయ్! మీరూ సీరియస్గా ఆలోచిస్తున్నారు. అంత తుళ్లిపడ్డారెందుకు? మన గురువు సీరియస్గా ఉండటానికి కారణం కనుక్కున్నాను. ఇందాక మామయ్య దగ్గర కాస్సేపు కూర్చుని వచ్చాను. ఇవాళ ఆయన డోర్ ప్యూన్ రాలేదు. మన ప్యూన్ని అక్కడ కూర్చోపెట్టారు. అతనికి సైకిలు రాదు. మా మామయ్య కూతురు మాధవి వాళ్ల నాన్న దగ్గరకు వచ్చిందట. దానికివాళ పరీక్ష, హాల్ టిక్కెట్టు ఇంట్లో మరచి పోయిందట. వెనక్కి వెళ్లటం ఇష్టంలేక జ్ఞాపకం రాగానే దార్లో ఇక్కడ దిగింది. మామయ్య మన గురువుగార్ని పిల్చి ఇంటికి వెళ్లి హాల్ టిక్కెట్ తేవటానికి మరో ప్యూన్ ఎవర్నైనా పంపమన్నార్ట. ఎవరూ ఇతని మాట వినలేదు కాబోలు, అందుకే అంత కోపం, సీరియస్నెస్. అంతకన్న ఏమీ లేదు. ఫోన్ చేసి ఇంటి నుంచి హాల్ టికెట్ తెప్పించారట" అన్నాడు. గిరిజ హృదయం తేలికపడి హాయిగా నవ్వింది.

అయిదవుతున్నదనగా బయటికి వెళ్లినవాళ్లంతా ఆఫీసులోకి వచ్చారు. అంతా ఫైల్సు లోపల పెట్టేసి బయట చేరారు. గిరిజకూడా పర్సు, టిఫిన్ డబ్బా తీసుకుని బయల్దేరింది. మూర్తి "గురువుగారు వచ్చేవరకూ నేనుంటాలెండి. వాతావరణం చల్లబరచాలి!" అన్నాడు నవ్వుతూ.

గిరిజ ఇల్లు చేరే వరకూ ఇవే ఆలోచనలతో గడిపింది. ఏది ఏమైనాసరే! ఎవ్వరికీ భయపడకూడదు. తప్పు చెయ్యనప్పుడు ఎందుకు భయపడాలి? ఇంట్లోవాళ్లకి నామీద నమ్మకం ఉంటే చాలు, ఎవ్వరినీ లెక్కచెయ్యను. మూర్తిగారితో ఎప్పుడూ ఇట్లాగే సరదాగానే ఉంటాను అని నిశ్చయించుకుని నిర్మలమైన మనస్సుతో హాయిగా ఇల్లు చేరింది. ఉదయం నుంచీ పడిన శ్రమనంతా మరచి హాయిగా నిద్రపోగలిగింది.

-:o o o:-

# కంపుగొఱ్ఱె

ఉదయం నుంచీ హాస్టల్లో పంపుల్లోంచి నీళ్ళు రావటం లేదన్న వార్త విద్యార్థి లోకంలో కల్లోలం రేపింది. కూజాల్లో నీళ్లతో ముఖాలు కడిగి కాఫీలు సేవించారు. కొంతమంది పుస్తకాల ముందు కూర్చున్నారు. మరికొందరు స్నానగత ప్రాణులు తువ్వాళ్ళు సబ్బులు పట్టుకొని బాత్‌రూమ్ ముందు కబుర్లు చెప్పుకొంటున్నారు. వార్డెన్‌గారికి కబురెళ్లింది.

బాత్‌రూమ్ దగ్గర కబుర్లు చెప్పుకుంటున్న వాళ్ల దృష్టి ఎదుటి వరుసలో మూడో గదిలో కూర్చుని చదువుకుంటున్న మధు మీద పడింది. కేకేశారు. చేతులో పుస్తకంతోటే వారి మధ్యకు వచ్చాడు. అతను తాను నవ్వకుండా అందరినీ నవ్వించి ఆకర్షిస్తాడు. నీళ్ల లేకపోవడం వల్ల స్నానం ఆలస్యం అవటం గురించి సంభాషణ జరుగుతోంది. మధు ఫక్కున నవ్వాడు, కారణం చెప్పందే వీల్లేదన్నారు మిత్రులు, బలవంతంమీద "నాకో కథ జ్ఞాపకం వస్తోంది!" అంటూ మొదలెట్టాడు.

"ఒక హాస్టల్లో 'ఏ ప్రాంతం వారు శుభ్రంగా ఉంటారు?' అనే వివాదం వచ్చింది. దాన్ని పరీక్షించి పరిష్కరించుకోవాలని ఒక కంపు గొఱ్ఱెను ఒక రూమ్‌లో కట్టేశారు. ఒక్కొక్కరినే లోపలకు పంపుతున్నారు. తెలుగువాడు ఒక్క సెకండులో పైకివచ్చి వాంతి చేసుకున్నాడు. తమిళుడు ఒక్క నిముషంలో బయటికి వచ్చి పలవరించుకున్నాడు. కన్నడ సోదరుడు కాస్సేపటికి ముక్కు పట్టుకుని బయటికివచ్చి బాధపడ్డాడు. పంజాబీ అతని ఛాన్సు వచ్చింది. అతను లోపలికి వెళ్లాడు. అంతా ఆశ్చర్యంగా చూస్తుండగా గొఱ్ఱె బయటికి వచ్చి పారిపోయింది" అని కథ ముగించి మధు గదిలోకి వెళ్లిపోయాడు.

-:o o o:-

# ఎదురుతిరిగిన ప్రేమ

రైలు కదిలే సమయానికి హడావిడిగా వచ్చి ఎక్కిన ఆ యువతిని చూసి ఆశ్చర్యపోయాను. ఆమె ఒకమూల ఖాళీగా ఉన్న జాగాలో ఇద్దరు పిల్లలతో కూర్చుంది. మొగపిల్లవాడికి ఏడేళ్ళు, ఆడపిల్లకి అయిదేళ్ళూ ఉంటై, ఇద్దరూ ముద్దుగా ఉన్నారు. నేను మరోసారి తేరిపార చూసి ఆ అమ్మాయి ప్రేమేనని స్థిరపరచుకున్నాను పలుకరిద్దామంటే అసలు ఆ అమ్మాయి ఈ లోకంలో ఉన్నట్టులేదు. పెట్టెలో ఎవరినీ చూసినట్టుగా కూడా లేదు. బయటికి చూస్తూ కూర్చుంది. పిల్లలిద్దరూ వాళ్ళల్లో వాళ్లే ఆడుకుంటూ కిటికీలోంచి బయటికి చూస్తూ, వాళ్ళు చూసిన వింతల గురించి చెప్పుకుంటూ ఆశ్చర్యపోతున్నారు. ఉన్నట్లుండి బాబు కంట్లో నలకపడినట్టుంది. కళ్ళు నలపటం మొదలెట్టాడు. పాప "అమ్మా! అమ్మా! అన్న కంట్లో ఏదో పడింది, ఏడుస్తున్నాడు" అంటోంది. ప్రేమ 'ఊఁ' అన్నదే గాని పిల్లాడిని దగ్గరకు తియ్యలేదు. వాడికంట్లో ఏంపడిందోనని ఆదుర్దాపడలేదు.

నేను 'బాబూ, రా!' అని పిలిచాను. గబగబా దగ్గరకు వచ్చేశాడు వాడివెనకే పాప వచ్చేసింది. నేను కర్చీఫ్‌తీసి వాడికంటికి ఆవిరిపెట్టాను కన్నుతెరచి ఊదాను. బొగ్గునలక వచ్చేసింది. వాడి కళ్లంట నీరు కారిపోయింది. ఆ కళ్ళనీళ్ళతోనే నన్ను చూచి నవ్వాడు. వాణ్ణి హృదయానికి హత్తుకున్నాను. అది చూసి పాప నెమ్మదిగా నావళ్ళో కూర్చోటానికి ప్రయత్నించింది. ఇద్దరినీ కూర్చోపెట్టుకొని కాస్సేపు ఆడుకున్నాను. కాని నా కళ్ళు ప్రేమనే గమనిస్తున్నాయి. కాస్సేపటికి ఏమనుకుందో ఏమో పిల్లలకోసం హడావిడిగా వెతుక్కుంది. పిల్లల్ని చూచి తరువాత నన్నుచూసి 'అన్నయ్యా!' అనేసి తలవంచుకుంది. గబగబా తన చోట్లోకి వెళ్ళి చేతుల్లో ముఖం దాచుకుంది. ప్రేమ ఏడుస్తోందని తెలుస్తోంది. పిల్లలిద్దరూ బిక్కముఖాలతో కూర్చున్నారు. నేను పెట్టెలో మిగతా ప్రయాణికులు ఉన్నట్లు మరచిపోయి గబగబా దగ్గరికి వెళ్ళి 'ప్రేమా!' అన్నాను. ఏడుపు మరీ ఎక్కువయింది. కాస్సేపు ఏడవనిచ్చాను. తరువాత తనే సమాళించుకొని 'అన్నయ్యా!' అంటూ తలఎత్తి చూసింది. రెండుకళ్ళు నీళ్ళతో నిండిపోయాయి. ఆ చిన్నప్పటి అమాయకత్వం, నైర్మల్యం అలాగే ఉన్నై. ఆ నల్లని పెద్దకళ్ళు, పెద్దరెప్పలు - ఆ అందం నే నెవ్వరికీ చూడలేదు.

ప్రేమ ప్రక్కన కూర్చున్న ముసలాయన ఏమనుకున్నాడో ఏమో, 'నువ్విలా కూర్చోబాబూ!' అంటూ తను లేచివెళ్ళి నా స్థలంలో కూర్చున్నాడు. నేను ప్రేమ ప్రక్కనే కూర్చున్నాను. పిల్లలిద్దరూ కిటికీలోంచి బయటికి చూస్తూ ఆటల్లో పడ్డారు. నేను నెమ్మదిగా 'ఎక్కడి దాకా నీ ప్రయాణం ప్రేమా!' అన్నాను. 'మద్రాసు' అన్నది. నేను హాయిగా ఊపిరి పీల్చాను. నేను వెడుతున్నదీ మద్రాసే. ఈ రైలు మద్రాస్ చేరేలోపల ప్రేమ విషయం తెలుసుకోవచ్చని. నా ఆత్రానికి కారణం లేకపోలేదు. మేమంతా చిన్నప్పుడు ఇరుగుపొరుగిళ్ళల్లో ఉండేవారం. ప్రేమ అన్నయ్య రవి, నేను ఒకే స్కూల్లో ఒకే క్లాసు చదివేవాళ్ళం. నాకు చెల్లెళ్ళులేని కొరత ప్రేమ తీర్చింది.

ప్రేమ వాళ్ళింట్లో మొత్తం ఆరుగురు పిల్లలు, వచ్చే పోయే బంధువులతో, చాలీచాలని సంపాదనతో సంసారాన్ని అతికష్టంగా నడిపించే రవి తండ్రిగారు నాకు బాగా గుర్తు. రవి తల్లి చాలా అందగత్తె. పిల్లలంతా అందంగా ఉండేవారు. కడుపునిండా తిండి, శుభ్రమైన బట్టలు ఉంటే ఈ పిల్లలు ఇంకా ఎంతబాగుండేవారో ననిపించేది. నలుగురు మొగపిల్లల తరువాత ప్రేమ, తరువాత రమ. మేము ఎస్.ఎస్.ఎల్.సి.లోకి వచ్చేసరికి ప్రేమ చదువు మానేసింది. అప్పుడు ఆడపిల్లలకి ఉచిత విద్య ఉండేదికాదు. రెండు రూపాయల పద్నాల్గణాల జీతం కట్టలేక చదువు మాన్పించారు. నేనొకసారి మాటల్లో రవితో ప్రేమ చదువు మానెయ్యటం గురించి ప్రస్తావించాను అతను నవ్వుతూ 'నీకు తెలీదు గోపాల్! జీతం ఒక్కటేకాదు, బడికిపంపిస్తే బోలెడు మిగతా ఖర్చులు కూడా ఉంటై. అదీకాక మా నాన్న మొగపిల్లల్ని చదివించటానికే ఎంతో కష్టపడుతున్నారు. పరీక్ష ఫీజు కట్టడానికి డబ్బులేక మా అమ్మ ప్రధానపుంగరం అమ్మి నా పరీక్ష ఫీజు కట్టాను. అయినా మా ప్రేమకేం తక్కువ? చదువుకున్నా చదువుకోకున్నా మా అత్తవాళ్ళ రఘుకి చేసుకుంటుంది. నీకు తెలుసుగా, పాలిటెక్నిక్ చదువుతున్నాడు. వాడి చదువు అయిపోగానే ఎట్లాగో పెళ్ళిచేస్తారు. ఇంక రమ సంగతంటావా! దాని పెళ్ళివరకూవచ్చేసరికి మేమంతా ఉద్యోగాల్లో చేరి మంచివాణ్ణి తెస్తాం!' అన్నాడు ధీమాగా. నాకామాటలన్నీ గుర్తు వచ్చి, అల్లాంటివాళ్ళందరూ ఉండగా పిల్లలతో ఒంటరిగా ప్రేమ మద్రాస్ వెళ్ళటమేమిటనే ఆలోచనలో పడిపోయాను. నెమ్మదిగా ప్రేమను రవి సంగతి అడిగాను. అది విని ఏమనుకుందో ఏమో! 'అన్నయ్యా! నన్నెవరూ అర్థంచేసుకోరు' అంది. 'ఏమిటి ప్రేమా?' అన్నాను ఆశ్చర్యంగా.

ప్రేమ మొదలు పెట్టింది. 'అన్నయ్యా! నువ్వు అన్నయ్య ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షలు రాశాక మీకు బదిలీ అయి వెళ్ళిపోయారు. తరువాత అన్నయ్యకు ఉద్యోగం దొరికింది. బావ చదువైపోయింది. నన్ను అత్తావాళ్ళింటికి తీసుకెళ్ళి అక్కడే పెళ్ళిచేశారు. బావకి ఉద్యోగం దొరికింది. అంతా నా అదృష్టం అన్నారు. నేను అత్త మంచిదనే అనుకున్నానుగాని బావమీద పిచ్చి అభిమానమని తెలియదు, బావ నాతో సరదాగా ఉండటం చూసిన అత్తయ్య నా మీద కక్షకట్టి సాధించటం, బావకు నేరాలు చెప్పటం సాగించింది. ఆవిడ తన దయాదాక్షిణ్యాలవల్లనే తన కోడలయినానని చెప్పేది. నేనా సంగతి నిజంగనక మెదలకుండా ఊరుకున్నాను. ఎప్పుడన్నా బావ బయటకెళ్దామన్నా, సినిమాకు వెళ్దామన్నా అత్తభయానికి రానవేదాన్ని, తనూ అర్థంచేసుకోకుండా నేను మొండిదాన్ననే బిరుదు తగిలించి కొట్టడంకూడా మొదలెట్టాడు. బాబు పురిటికి పుట్టింటికి తీసుకొచ్చారు. నేను అత్తగురించిగాని బావగురించిగాని నోరువిప్పి చెప్పటానికి వీల్లేదు. ఎందువల్లంటే, మా కుటుంబానికి ఆర్థికస్తోమతులేని పరిస్థితిలో నన్ను తన కోడలుగా చేసుకున్న బావనూ, అత్తనూ పొగిడేవాళ్ళేకాని నేనోమాట ప్రస్తావించినా వినిపించుకునేవారుకారు. వృథా కంఠఘోష ఎందుకని ఊరుకున్నాను. బాబు పుట్టాక బావ రాలేదు. అత్త రాలేదు. లేనిపోని వృథాఖర్చులు చెయ్యటం అనవసరమని రాసిందిట అత్త నాన్నకు. బాబుకు మూడో నెల వచ్చినా నన్ను రమ్మని రాయలేదు. తీసుకెళ్ళలేదు. ఇంట్లో అంతా పిల్లాడిని ముద్దుగా చూసేవారు. ఐదో నెల వెళ్తుందనగా ఏమనుకున్నారో ఏమో, చలిమిడి రస్కోరాలు చేసి కొత్తబట్టలు పెట్టి అమ్మేనన్ను అత్తవారింట్లో దిగబెట్టింది. అమ్మను బావ, అత్తయ్య ఎంతో బాగా ఆదరించి, వెళ్లేటప్పుడు చీరె, రవికెపెట్టి పంపారు. అమ్మ తన కూతురెంతో అదృష్టవంతురాలమకుని పొంగిపోతూ ఇంటికెళ్ళింది. మళ్ళీ నా గొడవ మొదలు. మనుమడు పుట్టాక అత్తకి నా మీద కోపం పోతుందనుకున్నాను. బావకి కావలసిన వస్తువులందించాలనీ వంటచేసి పెట్టాలనీ తయారయేదాన్ని. బావ ముఖంలో కాస్త సంతోషం కనపడేది. బావ బయటికి వెళ్ళాక సాధింపు మొదలు. 'అస్తమానం రాచుకు తిరగితేనా మొగుడా! పెద్దవాళ్ళున్నారని సిగ్గు, భయం ఏమీ లేవు' అంటూ తిట్టేది. నేను ఏమీ జవాబు చెప్పకుండా ఊరుకునేదాన్ని. ఏదో ఆలోచిస్తూ బావ పిల్చినప్పుడు ఎప్పుడైనా పలక్కపోతే తనూ తిట్టేవాడు "ఉత్త ఇడియట్! చదువూ సంధ్యా రాని మొద్దు. ఏమన్నా అంటే పెద్దగుడ్లేసుకుని దయ్యంలా చూస్తుంది'' అని. ఇట్లాంటి గొడవలమధ్య పాప నా కడుపున పడింది.

ఒక్కొక్కసారి బావకు ఎదురుతిరిగి చదువు సంధ్యారాని మొద్దునని తెలిసే చేసుకున్నావుగా అని అడగాలనిపించేది. ఏదో అతీతమైన శక్తి నా గొంతులోంచి మాటలు రాకుండా నొక్కేసింది. బావ తనతోపాటు పనిచేసే లెక్చరర్ వనజని అప్పుడప్పుడు ఇంటికి తీసుకురావడం మొదలెట్టాడు. వాళ్ళిద్దరూ గంటలకొద్దీ కబుర్లు చెప్పుకునేవారు. అత్త అతిసంతోషంగా కొడుకు ప్రజ్ఞకి మురిసిపోయేది. నన్ను పురిటికని వంకపెట్టి పుట్టింటికి పంపేశారు. పాప పుట్టింది. ఈలోపల బావకి భోపాల్ బదిలీ అయిందని అత్తని మా దగ్గరికి పంపేశారు. వనజకి కూడా బదిలీ అయిందట. ఇద్దరికి భోపాల్‌లోనే పని. ఇంట్లో అందరూ అత్తని దేవతల్లే చూసేవారు. ఉన్నట్టుండి అత్త రెండు రోజులు జ్వరంతో కన్నుమూసింది, బావ వచ్చాడు కర్మలన్నీ ఘనంగా జరిపించి వెళ్ళిపోయాడు. ఇంట్లో అందరూ నన్ను తీసుకెళ్ళటం గురించి నాతో చెప్పాడనుకున్నారు. వాళ్ళతో చెప్పాడనుకున్నాను నేను. మరో నెల్లాళ్ళకి నాన్న పేర ఉత్తరం రాశాడట -మీ అమ్మాయి నాకక్కర్లేదు, మీ దగ్గరే ఉంచుకోండి, డబ్బు పంపిస్తుంటాను అని. నాన్న అన్నలు అంతా ఎగిరారు. ఆ కోపంలో 'దీనికి బుద్ధిలేదు. భర్తని ఎలా సంతోషపెట్టాలో తెలీదు. మొండి వేషాలేసేదిట' అంటూ సాధించారు. నేను కళ్ళనీళ్ళు పెట్టుకోవడం తప్ప ఏం చెయ్యగలను? ఈ సంగతి తెలిసిన బాబాయే మేనల్లుడికి బుద్ధిచెపుతానని వెళ్ళి, బావచేత తిట్లుతిని, తంతాడని భయంతో వచ్చేసి 'పోనీలేరా!' వాడితిక్క తగ్గితే వాడే తీసుకెళతాడు. ప్రతినెలా డబ్బు పంపుతానన్నాడు. ఈ బట్టలు పంపాడు' అంటూ ఖరీదయిన బట్టలమూట నా ముందుంచాడు. అది చూసి అంతా మురిసిపోయారు. నన్ను వెళ్ళి వనజకి, బావకి సేవచేయమన్నారు. వాళ్ళ మనసు మారటానికి సినిమాలు కానివి - జీవితాలు.

నేనేం చెయ్యను? అందరిలా నాకూ భర్తతో వెళ్ళి బట్టలు కొనుక్కోవాలనీ, ఇద్దరం చెరో పిల్లనీ ఎత్తుకొని బయటికి వెళ్ళాలనీ ఉంటుంది. తరువాత పరిస్థితులు మారి నా తోడబుట్టినవాళ్ళూ నన్ను కన్నవాళ్ళే నాకు శత్రువులయ్యారు. ఏ కాస్త చెడుజరిగినా నేనేడవటంవల్ల జరిగిందనేవారు. మా ఇంట్లో ఏడవద్దనేవారు. ఆఖరుకు మనస్సుకు బాధకలిగినప్పు డేడవటానికి, నాక్కోపం వచ్చినప్పుడు నా పిల్లలను కొట్టటానికి కూడా స్వతంత్రం లేకుండాపోయింది. నా మనస్సెలా ఉన్నా అందరూ నవ్వుతుంటే నవ్వటానికి నేను యంత్రాన్ని కాదుగా!

బావ విషయం తెలిశాక నేనేదన్నా చదువుకుంటానని పనిచేస్తాననీ అంటే ఇంట్లో అంతా ఏక కంఠంతో వల్లకాదన్నారు. ఇప్పుడు చూడన్నయ్యా! అన్నయ్యలంతా చదువులు, ఉద్యోగాల మీద దూరదూరంగా వెళ్ళిపోయారు. అందరికి పెళ్ళిళ్ళయి ఎవరిసంపాదనలతో వాళ్ళున్నారు. రమకి పెళ్ళయింది. నాన్న రిటైరయారు. నాన్న పెన్షన్‌తో, ఆయన పంపే ఇరవయి రూపాయలతో అయిదుగురి జీవితాలెలా జరుగుతాయి? ముందు ముందు పిల్లలసంగతెట్లా? ఇన్నాళ్ళూ మేనమామలు చూస్తున్నారని ఊరుకున్నాను. అంతా వెళ్ళిపోయారు. ఇన్నాళ్ళూ చేతులు ముడుచుకుని ఒకమూల కూర్చున్నాను. ఇంక కూర్చోదల్చుకోక ఎవ్వరితో చెప్పకుండా వచ్చేశాను. ఆయన మద్రాస్‌లో ఉన్నారట. ఇక నాకు భయంలేదు. ఎదురుతిరుగుతాను- ఇరుగో మీ పిల్లలు. చంపినా, బతికించినా, బాగుచేసుకున్నా మీ బాధ్యత అని పిల్లలను అప్పగించి వచ్చేస్తాను. ఇంక నా జీవితం ఏమయినా దిగుల్లేదు" అంటూ కళ్ళు తుడుచుకుంది. ఆ కళ్ళల్లో నీళ్ళు ఆరిపోయినై.

నా గుండెలో రాయిపడింది. "ప్రేమా! నీ బాధ నాకర్థమయింది. నీ వ్యక్తిత్వాన్ని చంపుకోలేక నీలో నువ్వే బాధపడి కృంగిపోయావు. నా ఎడ్రస్ ఇస్తాను. పిల్లల్ని అప్పగించి నా దగ్గరికి రా! ఏ అఘాయిత్యం తలపెట్టనని మాటియ్యి. నీకు దారి చూపిస్తాను. నువ్వు స్వతంత్రంగా, సమాజంలో గౌరవంగా బతికేటట్టు చేస్తాను. నీ అన్నయ్యే ననుకోవమ్మా!" అంటూ బలవంతంగా చేతిలో చెయ్యి వేయించుకున్నాను. మేం తేరుకునేసరికి పిల్లలిద్దరూ ఒకళ్ళమీద ఒకళ్ళుపడి నిద్రపోతున్నారు. రైలు సెంట్రల్ స్టేషన్ చేరింది హడావిడిగా.

-:o o o:-

# పశ్చాత్తాపం

హాలు కిటకిటలాడుతోంది. గాలికి మామిడి తోరణాలు, రంగు కాగితాల తోరణాలు చిన్నగా కదులుతున్నై. సభకి అధ్యక్షత వహించవలసినవారు ఇంకా రాలేదు. మొదటి వరుసలో ఒక మూలగా కూర్చున్న గిరిజాకుమారి విసుగ్గా వాచీ చూసుకున్నది. ఉగాది సందర్భంలో ఆ కాలనీ వారంతా కలసి ఒక సాంస్కృతిక కార్యక్రమం జరుపుకుంటున్నారు. గిరిజాకుమారి ప్రోగ్రాం కాగితం తీసి చూసుకుంది. ప్రఖ్యాత రచయిత్రి శాంతాశివరామ్‌కి సన్మానం. ఆమెచేతనే పోటీల్లో గెలిచినవారికి బహుమతి ప్రదానం.

ప్రతివారు ప్రతిరోజూ తాముచేసే పనులనుండి మార్పు కోరుతారు. ఆ మార్పువల్ల శరీరానికి, మనస్సుకీ విశ్రాంతి లభిస్తుంది. నాగార్జున సాగర్‌వల్ల విజయపురి కాలనీ జగత్ప్రసిద్ధిపొందింది. అక్కడున్న ఉద్యోగస్తులంతా కలిసి సాంస్కృతిక సంఘంగా ఏర్పడి దానిక అనుబంధంగా ఒక లైబ్రరీ, థియేటరు నిర్మించుకున్నారు. ఉద్యోగస్థుల్లో రచయితలు, చిత్రకారులు, గాయకులు కూడా ఉన్నారు. వారంతా కలసి ప్రతి నెలా ఒక కార్యక్రమం ఏర్పరచుకుని దానికి ఉద్యోగస్థులు కుటుంబాలతో సహా హాజరై ఆనందిస్తుంటారు. గిరిజాకుమారి అక్కడకి కొత్తగా వచ్చింది. ఆమె లేబర్ వెల్‌ఫేర్ ఆఫీసరు. ఆమెకి ఇట్లాంటి కార్యక్రమాలంటే ఇష్టంలేదు. కాని తప్పనిసరిగా రావలసి వచ్చింది. మహిళా సమాజం తరపున శాంతాశివరామ్‌కి సన్మానం చెయ్యాల్సిన సెక్రెటరీ లక్ష్మీదేవికి ఆరోగ్యం బాగులేదని ఆ బాధ్యత గిరిజాకుమారి మీద పెట్టారు. కార్యనిర్వాహకులవల్ల తెలిసిన కొత్త విషయం ఏమంటే- శాంతాశివరామ్ అక్కడ అసిస్టెంటు ఇంజనీరు శివరామ్ భార్య.

సభలో కలకలం బయల్దేరింది. అధ్యక్షులు వచ్చారు. కార్యనిర్వాహకులు మైకులో అధ్యక్షులవారినీ, వక్తలనూ వేదిక నలంకరించమని కోరుతున్నారు. గిరిజాకుమారి చుట్టూ చూసి బేడ్జి తగిలించుకున్న ఒకరిని "శాంతాశివరామ్‌గారు రాలేదా?" అనడిగింది. అందుకతడు "హైదరాబాదు నుండి ఇప్పుడే వచ్చారట. పదినిమిషాల్లో వస్తారని తెలిసింది, తమరు వేదికమీదికి దయచేయండి. సభ ప్రారంభం అవుతోంది!" అని వేదికపైకి పిల్చుకెళ్ళాడు. వేదికపైకి వెళ్ళి అధ్యక్షులవారికి నమస్కరించి ఒక చివర కూర్చుంది.

ప్రార్థనా గీతం పాడాక పూలమాలలు తెచ్చివేశారు. కార్యక్రమం మామూలుగా సాగిపోతోంది. అధ్యక్షులు తమ ఉపన్యాసాన్ని క్లుప్తంగా ముగించారు. కార్యదర్శి నివేదికలో తమ కార్యక్రమాలను వివరిస్తున్నారు.

పరాగ్గా ఆలోచిస్తున్న గిరిజాకుమారి ప్రేక్షకుల మధ్యలో సందడి విని తలెత్తి చూసింది. కార్యకర్తలలో ఒకరైన వెంకట్రావుగారు ఎవరినో సగౌరవంగా వెంటబెట్టుకొని తీసుకువస్తున్నారు. ఆమే కాబోలు శాంతాశివరామ్! అంతా ఆమెను ఆతృతగా చూస్తున్నారు. ఆమె వెనుకనే శివరామ్ అలవాటయిన పోజులో జేబుల్లో చేతులు పెట్టుకుని హుషారుగా వస్తున్నాడు. ఎప్పటిలాగే తెల్లటి షర్టు నీలం టెర్లిన్ పేంట్‌లోకి టక్ చేశాడు. హుందాగా నడిచి వస్తుంటే తెల్లటి షర్టుమీద 'టై' గాలికి కదులుతోంది. వాళ్ళు దగ్గరకు వస్తున్నకొద్దీ గిరిజాకుమారికి ఆతృత ఎక్కువౌతున్నది.

శాంతాశివరాం లేత నీలంరంగు జరీచీరె కట్టుకుంది. తలనిండా సన్నజాజులు. బుజాల నిండుగా పమిట కప్పుకుని తల వంచుకుని వస్తున్న ఆమెను ఎక్కడో చూసినట్లుంది. ఆమె వేదికమీదికి రాగానే ప్రేక్షకుల చప్పట్లతో హాలు దద్దరిల్లిపోయింది. శాంతాశివరామ్‌ను గిరిజాకుమారికి పరిచయంచేసి ఆమె పక్కనే కూర్చోపెట్టారు. రెండు క్షణాలు శాంతాశివరామ్‌ను పరీక్షగా చూసేసరికి గిరిజాకుమారి మనస్సులో ఏదో తళుక్కుమంది, ఒళ్ళంతా చెమటతో తడిసింది. వెన్నులో సన్నగా వణుకు ప్రారంభం అయింది. అది పైకి తెలియకూడదని సర్దుకుని కూర్చుంది. అతి సామాన్యంగా అలంకరించుకుని చామనఛాయతో సన్నగా ఉండే శాంతేనా శాంతాశివరామ్. అసిస్టెంటు ఇంజనీరు భార్య. ఆమె కథలు కొన్ని చదివింది కూడా.

గిరిజాకుమారిలో ఈర్ష్య తొంగిచూసింది. అలా ఆలోచిస్తూ ఉండగానే మనస్సు గతంలోకి జారిపోయింది. స్కూలు ఫయినలు పాసయ్యేసరికి తండ్రి పక్షవాతంతో మంచానపడ్డాడు. కాలూ, చేయ్యీస్వాధీనం తప్పాయి. తప్పనిసరిగా ఉద్యోగం విరమించవలసి వచ్చింది. ఏ విధమైన సహాయంలేని ఆ కుటుంబం ఎలా జరపాలోనని తల్లిదండ్రులు పడే వేదనని అర్థం చేసుకోగలిగింది పెద్దకూతురు గిరిజ ఒక్కతే. ఎన్నో ఉద్యోగాలకి అప్లయిచేసింది. ఈ లోపల కొన్ని ట్యూషన్లు ఏర్పరచుకొని కుటుంబం జరిగేటట్లు చూడటం మొదలెట్టింది. మెల్లగా టైపు పాసయింది. ఉద్యోగం కోసం

పెద్దపెద్దవాళ్లందరి దగ్గిరా తన కష్టాలు చెప్పుకుని ప్రాధేయపడేది. టెంపరరీగా ఉద్యోగం చేస్తూ, గొప్పవాళ్ళసహాయంతో ప్రైవేటుగా ఎమ్మే., పాసయింది. టైపిస్టుగా, ఎల్.డి.సి.గా చాలాచోట్ల టెంపరరీగా ఉద్యోగం చేసింది. ట్యూషన్ చెప్పే పిల్లలమేనమామతో తన గోడంతా చెప్పుకుంది. అదృష్టవశాత్తూ ఆఫీసరుద్యోగానికి ఎడ్వర్‌టయిజుమెంటుపడటం, అప్లయ్‌చెయ్యటం జరిగిపోయాయి. తన కుటుంబం పరిస్థితులు తెలిసి, సానుభూతి చూపి, సహాయం చేసిన పెద్దమనుషులవల్ల ఆఫీసరయింది. ఎప్పుడూ ఎరగని ఉద్యోగపు హోదా అవీ గిరాజాకుమారికి గొప్పగా కనిపించాయి. తానేదో పెద్దకొండశిఖరంపై ఉన్నట్లు మిగతా చిన్న ఉద్యోగాలు చేసేవారంతా చిన్న చిన్న చీమల్లా దోమల్లా కనిపించసాగారు. కాని ఇంట్లో పరిస్థితులు మరీ అధ్వాన్నంగా తయారయ్యాయి. ఎప్పుడూ పోట్లాడుకునే అన్నదమ్ములూ, రోగిష్టి తండ్రీ, సంసారాన్నీదలేక విసుక్కునే తల్లీ, దిగులు ముఖాలతో తిరిగే చెల్లెళ్ళ మధ్య జీవితం నరకప్రాయమైంది. ఆ ఊరినుంచి ట్రాన్స్‌ఫరయ్యాక తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది. ఎక్కువకాలం బయటినే గడిచిపోవాలని ప్రయత్నం. తనకి లేనివన్నీ ఉన్నట్లు గొప్పగా చెప్పుకోవటానికి ప్రయత్నం చేయసాగింది. అది 'ఆత్మవంచన' అని తెలిసికూడా ఆ బలహీనతను పోగొట్టుకోలేదు.

ఒకసారి ఏదో ట్రయినింగుకని కొత్తగా సెలక్టయిన ఆఫీసర్లందవరినీ హైదరాబాదు పిలిచారు. అందులో "సుజాత" అనే ఒక ఆఫీసరు గిరిజాకుమారిని తోడుతీసుకుని హెడ్డాఫీసుకి వెళ్ళింది. లంచ్ టైం కావటంవల్ల ఎవరూ సీట్లో లేరు. వెనుకవైపు కారిడార్లోకి తీసికెళ్ళింది సుజాత. అక్కడ కొందరు అమ్మాయిలు అప్పుడే టిఫిన్లు ముగించి కూర్చున్నారు సరదాగా మాట్లాడుకుంటూ, పత్రికల్లోవచ్చే సీరియల్ నవలల గురించీ, కవితల గురించీ, నగరంలో జరిగే సాహిత్యగోష్ఠుల గురంచి చర్చించుకుంటున్నారు. అందులో ఒక అమ్మాయి శాంతకుమారి. వాళ్ళు చీకూచింత లేనట్లుగా సరదాగా చర్చించుకోవటం గిరిజాకుమారికి ఈర్ష్య కలిగించింది. ఆ చర్చలు ఆసక్తిగా వింటూ కూర్చున్న సుజాతతో "ఇక్కడ వీళ్లిలా పుస్తకాలు చదువుతూ, కబుర్లు చెప్పుకుంటూ కూర్చుంటారటండి. మనకి పన్లు తొందరగా కావాలంటే ఎట్లా అవుతాయి చెప్పండి? అందులో ఆడపిల్లలు మరీను" అన్నది. సుజాత ఏమీ అనలేక ఊరుకుంది. శాంత "ఎల్.డి.సి" పని చేస్తున్నట్లు ఇదివరకే సుజాతవల్ల తెలిసింది. తన మాటలు ఎవ్వరూ లెక్కచెయ్యటంలేదని మళ్ళీ మొదలెట్టింది. "ఈ ఎల్.డి.సిలు, టైపిస్టులు

మరీటండి. అందుకే మా నాన్న నన్ను అట్లాంటి ఉద్యోగంలో పెట్టలేదు. నేను చెయ్యనని తెలుసనుకోండి! మనకిలా కబుర్లు చెప్పుకోవటానికి వీలుంటుందా?" అన్నది హేళనగా. ఆ మాటలు వాళ్ళు వినాలనే అన్నది. శాంత గిరిజాకుమారి వంక తీవ్రంగా చూసి టైము చూసుకొని కూర్చుంది. ఆ చూపు గిరిజాకుమారి గుండెల్లోకి దూసుకుపోయింది. కాస్సేపటికి వాళ్ళంతా లేచి వెళ్ళిపోయారు. సుజాత గిరిజాకుమారిని అక్కడే కూర్చోపెట్టి తాను లోపలికెళ్ళి పని చూసుకొని వచ్చేసింది.

తరువాత ఎన్నోసార్లు గిరిజాకుమారికి హెడ్డాఫీసుకి వెళ్లాల్సివచ్చింది. వెళ్తూనే ఉంది. తమకి సంబంధించిన సెక్షన్‌లోనే శాంతాకుమారి పనిచేస్తోంది. అక్కడ ఇంకా శాంతాకుమారి లాంటి వాళ్లు ఎవ్వర్నీ లెక్కచెయ్యరనీ ముక్కుకు సూటిగా పోయేవాళ్ళనీ తెలిసింది. కాని శాంత అందరితో సరదాగా ఉంటుందట, కాని ఆమె తనని ఎప్పుడూ పలకరించేదికాదు. గిరిజకు తాను ఆఫీసరుననే అహంకారం ఎక్కువ. ముభావంగా ఉండటం ఆఫీసరు లక్షణమని ఆమె అభిప్రాయం. చిన్న ఉద్యోగస్థుల దగ్గరకు వెళ్ళకుండానే తనపని జరగాలని అనుకునేది. ఒకసారి ఏదో పనిమీద వెళ్ళింది. ఆ పని శాంతదని తెలుసు. ఆఫీసరు దగ్గరకే వెళ్లి కూర్చుని తాను వచ్చిన పని చెప్పింది. ఆయన శాంతను పిల్చుకురమ్మని ప్యూన్‌ను పంపారు. గిరిజాకుమారి ఆఫీసరునన్న హోదాతో ఠీవిగా కూర్చుంది. శాంత నెమ్మదిగా వచ్చి ఆఫీసరుకి విష్‌చేసి కూర్చుంది. ఆఫీసరు "చూడమ్మా శాంతా!" అంటూ గిరిజాకుమారి ఫైలు విషయం అడిగారు. శాంత గిరిజాకుమారిని గుర్తించినట్లుగా "సరేనండి! ఫైలు పంపిస్తాను. రిపోర్టు సరిగ్గా లేదు. రూల్సుకి వ్యతిరేకం. మీరూ మరొసారి చూడండి!" అని వెళ్లిపోయింది. శాంతకుమారి తనవైపన్నా చూడనందుకు గిరిజకు వళ్లు మండిపోయింది. ఆమె నిర్లక్ష్యానికి వళ్ళుపిండుకుంది. ఆఫీసరు "రూల్సుకి వ్యతిరేకమని చెప్తున్నారు. అట్లా ఉంటే నేను చేయగలిగేదేమీ ఉండదు" అంటూ మరో ఫైలు చూడటం మొదలెట్టారు. శాంత వెళ్లిపోయింది. మరి కాస్సేపు కూర్చున్న ఆఫీసరు గిరిజాకుమారి వంక చూడక ఫైళ్లలో మునిగిపోవటం చూసి ఆమె సెలవు తీసుకుని వెళ్లిపోయింది. ఆ విషయంలో గిరిజాకుమారికి వ్యతిరేకమైన అర్డర్లు వచ్చేయని చెప్పక్కర్లేదు.

మరొకసారి అర్జెంటుగా రమ్మని కబురు చేస్తే హెడ్డాఫీసుకి వచ్చింది గిరిజాకుమారి. చీటిమీద పేరు రాసి ప్యూన్ చేతికిచ్చి డెరెక్టరు గదిముందు విజిటర్స్ హాల్లో కూర్చుంది.

డైరెక్టరుగారు ఎవరితోనో మాట్లాడుతున్నారట, ఎవరినో పిలవమన్నట్లున్నారు, ప్యూను సెక్షన్‌లోకి పరుగెత్తాడు. కాస్సేపటికి పవిట వంటి నిండుగా కప్పుకొని శాంత వచ్చింది. గిరిజాకుమారిని చూసి కొద్దిగా ముఖం చిట్లించుకుని డైరెక్టరు గదిలోకి ప్రవేశించింది. కాస్సేపటికి శాంతకుమారి నవ్వుతూ బయటికి వచ్చింది. ఆమె వెనుకే ఫుల్ సూట్‌లో ఒక పెద్దమనిషి, గిరిజ ఆయన్ను చూస్తూనే ఆశ్చర్యపడుతూ లేచీ నుంచుని "నమస్కారం!" అన్నది. ఆయన "ఏమమ్మా! ఇప్పుడెక్కడా ఉండటం? పరిస్థితులు చక్కబడ్డట్టేనా?" అని ఆప్యాయంగా అడిగారు. గిరిజాకుమారి తడబడుతూ "ఆఁ ఏదోసార్! మీ దయవల్ల బాగుపడ్డాను. ప్రస్తుతం గుంటూర్లో ఉంటున్నాను. మా వాళ్ళంతా రాజమండ్రిలోనే ఉన్నారు!" అన్నది. ఆయన పక్కనున్న శాంతను చూపిస్తూ "ఇదిగో ఇది మా ఆఖరమ్మాయి! శాంతకుమారి. మీకు తెలుసునుకుంటాను. ఇక్కడే పనిచేస్తోంది. పెళ్లినిశ్చయించాం, వచ్చే నెలలో పెళ్లి. ఆ మాటే వాళ్ల డైరెక్టరుతో చెప్పాలని వచ్చాను" అన్నారు శాంతకుమారి తండ్రి పక్కన తలవంచుకు నిలబడింది. మళ్ళీ ఆయన "వస్తానమ్మా! మళ్ళీ కలుద్దాం!" అంటూ కారువైపు నడిచారు, లోపల్నుండి డైరెక్టరు కూడా వచ్చి, హడావిడిగా ఆయన్ని సాగనంపటానికి కారు దగ్గరికి వెళ్లారు. వాళ్లిద్దరూ నవ్వుకుంటూ మాట్లాడుకుంటున్నారు. ఇద్దరి మధ్యా శాంత నిలబడింది. కారు వెళ్లిపోయింది. శాంత చకచకా సెక్షన్‌లోకి వెళ్లిపోయింది. తరువాత అరగంటకి గిరిజకు డైరెక్టరుతో మాట్లాడటానికి అనుమతి వచ్చింది.

గిరిజకు ఇంటికి వెళ్ళినా శాంత విషయమే గుర్తొచ్చేది. ఈర్ష్యతో మండిపోయేది, ఆమె తండ్రి తనకు చేసిన ఉపకారం తల్చుకుని సిగ్గుతో కుంచించుకుపోయేది.

ప్రేక్షకుల చప్పట్లతో గిరిజాకుమారి మామూలు ప్రపంచలోకి తిరిగివచ్చింది. కార్యదర్శి నివేదిక పూర్తయింది. అధ్యక్షులవారు తమ ఉపన్యాసం క్లుప్తంగా ముగించి "తరువాత కార్యక్రమం ప్రఖ్యాత రచయిత్రి శాంతా శివరామ్‌కి సన్మానం" అని ప్రకటించారు. చప్పట్లు ఐదు నిమిషాల వరకూ ఆగలేదు. కార్యదర్శి ఒక్కొక్క సంస్థ పేరు మైకులో చెబుతున్నారు. వారు వచ్చి ఆమెకు పూలమాలలు సమర్పించి వెడుతున్నారు. గిరిజాకుమారి రుమాలుతో ముఖం తుడుచుకోవటంతో పాత ఈర్ష్యను కూడా తుడిచేసుకుంది. తనకు తెలిసిన ఒక వ్యక్తిని అంతా ఇంత గౌరవిస్తున్నారంటే తనకీగౌరవమేనని నిశ్చయించుకుంది.

కార్యదర్శి తరువాత "మహిళా సమాజం తరపున శ్రీమతి శాంతా శివరామ్‌ను కుమారి గిరిజాకుమారి సన్మానిస్తారు!" అని ప్రకటించారు. గిరిజాకుమారి శివరాం వంక చూసింది. ఆయన నిశ్చలంగా కూర్చున్నాడు. గిరిజా కుమారి లేచి సంతోషంగా శాంతాశివరామ్ మెడలో పూలమాల వేసింది. ఆమె వినయంగా తలవంచుకుని పూలమాల స్వీకరించింది. సభా కార్యక్రమం పూర్తయింది.

గిరిజాకుమారి హృదయం తేలికపడింది. తనకి అన్నంపెట్టి తనను ఒక గౌరవనీయమైన స్థానంలో నిలబెట్టిన మహానుభావుడి కూతురిని అవమానించేనన్న బాధపోయింది. ఈ రోజు తనకామెను సన్మానించే భాగ్యం కలిగినందుకు, పశ్చాత్తాపమే తన పాపానికి పరిహారం అనుకుంది. చిరునవ్వుతో అందరివద్దా సెలవు తీసుకుని వెడుతోంది. శాంతా, శివరాం కనపడ్డారు. ఆమె భర్తతో తనగురించి చెప్తున్నట్టుంది. అతడు వంగి భార్య మాటలు నవ్వుతూ వింటున్నాడు. గిరిజాకుమారి ఇకమీద తన అహంకారం తగ్గించుకుని అణకువగా ఉండటానికి నిశ్చయించుకుంది.

-:0 0 0:-

# ముక్కు చిక్కు

పండగ పిండివంటల కమ్మని వాసన వరలక్ష్మమ్మగారింట్లోంచి వీధి చివర వరకూ గాలితోకలిసి వ్యాపిస్తున్నది. వరలక్ష్మమ్మగారి భర్త సుబ్బారావుగారు ఈజీఛైరులో కూర్చుని పేపరు చూస్తూ అప్పుడప్పుడు వంటింటివైపు చూస్తున్నాడు, వేళ దాటిపోయింది భోజనానికి అనుకుంటూ పిల్లలు హాల్లో కూర్చుని ఆడుకుంటూ తల్లిపిలుపుకోసం ఎదురుచూస్తున్నారు ఆకలి మొహాల్తో.

వంటంతా అయిపోయింది. పిండివంట పూర్తికావచ్చింది. వరలక్ష్మమ్మగారు బట్టలారేస్తున్న కొత్తకోడలు శకుంతలను కేకేసింది, "అమ్మాయ్ శకుంతలా, నా పని అయిపోవచ్చింది. నువ్వెళ్ళి దీపారాధనచెయ్యి, నైవేద్యం పెట్టేస్తాను," అన్నది. శకుంతల "అలాగే అత్తయ్యా!" అంటూ దేవుడి గదిలోకి వెళ్ళింది.

పది నిమిషాలు గడచినా కోడలు దీపం వెలిగించినట్లు కేక వినపడకపోయేసరికి, అత్తగారు "అమ్మాయ్, దీపం వెలిగించావా?" అని కేకేసింది. శకుంతల దేవుడిగదిలోంచి బయటకు రాకుండానే "దీపం వెలగటంలేదత్తయ్యా!" అన్నది. అత్తగారు చేతిలో పని ఉండటం వల్ల "ముక్కునలిపి వెలిగించు" అన్నది.

వరలక్ష్మమ్మగారు చేతిలోపని పూర్తయాక మహా నైవేద్యం పళ్ళెంలో అమర్చుకుని, మరచెంబుతో నీళ్ళు పట్టుకుని దేవుడిగదిలో ప్రవేశించి అక్కడి దృశ్యం చూచి నిర్ఘాంతపోయింది.

శకుంతల ముక్కు ఎర్రబడిపోయింది. దీపం దగ్గర ఆరిపోయిన అగ్గిపుల్లలు కుప్పగా పడి ఉన్నై. ఆ దృశ్యం చూసేసరికి వరలక్ష్మమ్మకు నవ్వూ కోపంకూడా వచ్చినై! అతికష్టం మీద ఆపుకొని శకుంతలను చూసి "ఏమిటే?" అన్నది శకుంతల. "అత్తయ్యా!" అంటూ అత్తగారి గుండెలో తలదాచుకుని ఏడవసాగింది. ఆమె సర్దుకొని, కోడలి తలనిమురుతూ, "ఎందుకే శకుంతలా, పండగపూట ఏడుపు? అసలేంజరిగింది! చెప్పమ్మా" అన్నది.

శకుంతల మరో రెండు నిమిషాలు ఏడిచి, వెక్కిళ్ళమధ్య "ముక్కు ఎంత నలిపినా దీపం వెలగలేదత్తయ్యా! ముక్కు మాత్రం బాగా నెప్పెడుతోంది" అన్నది. అత్తగారు కోడలి ముక్కు వైపు చూసింది. అసలే సంపెంగలాంటి ముక్కు ఎర్రగా అయిపోయింది. కళ్ళు నీళ్ళు కారుతున్నై, ఆమె నవ్వుతూ, "అదేమిటే పిచ్చిదానా! దీపం వెలగకపోతే వత్తి ముక్కు నలపమన్నాను. అంటే వత్తి చేసేటప్పుడు చివర సరిగ్గా నలిపి ఉండవు. అందుకని వత్తిముక్కు నలపమన్నాను. నీ ముక్కు నలుపుకుంటే దీపం వెలుగుతుందా? వెళ్ళు, ముఖం కడుక్కురా! ఈ లోగా నేను దీపారాధన వెలిగిస్తాను, నమస్కారం చేసుకుందుగాని" అన్నది.

శకుంతల కళ్ళుతుడుచుకుని ఇట్లాంటి సంగతులు తనకి అర్థంకాకపోవడానికి కారణం ఆలోచిస్తూ పెరట్లోకి నడిచింది.

-:0 0 0:-

# బాధ్యత

"శారదా! శారదా!" అన్న పిలుపు విని ఏదో ఆలోచిస్తూ ముగ్గులు పెడుతున్న శారద లేచి నించుంది. ఈలోపల చిన్న కూతురు నీల 'అమ్మా! నాన్న పిలుస్తున్నారు!' అని తల్లి చేతిలో ముగ్గు గిన్నె అందుకుంది. శారద చీరెకొంగులు సరిచేసుకుని వాకిట్లోకి వెళ్ళింది. అక్కడ పందిట్లో పిల్లలు గోలగా స్థంభాలాట ఆడుకుంటున్నారు. వరండాలో ఈజీచైర్లో కూర్చున్న శేఖరం ఎకౌంటు పుస్తకాలు చూసుకుంటున్నాడు. పోస్టుమెన్ ఒక పెద్దపార్శిల్ పట్టుకుని వించున్నాడు. శారద ప్రశ్నార్థకంగా భర్తవైపు చూసింది. "రఘుట, పార్శెలు పంపాడు నీ పేరట, తీసుకో!" అని తన పనిలో మునిగిపోయాడు మళ్లీ.

శారద సంతకం చేసి పార్శెల్ తీసుకుని లోపలికి వెళ్లింది. గదిలోకి వెళ్లి పార్శెలు విప్పింది. అక్కడే కూర్చున్న పెళ్లికూతురు హారిత, ఆమె స్నేహితులు అంతా చుట్టూ చేరారు. మూడు చీరెలు, జాకెట్టుబట్టలు, జరీదోవతులు, కండువాలు కనిపించాయి. అన్నింటి మీద పేర్లు రాసిన చీటీలు అంటించి ఉన్నాయి. అమ్మాయిలంతా అందులోనే ఉన్న అట్టడబ్బా విప్పిచూశారు. అందులో అంటించిన చిన్నకాగితంపై, 'పెండ్లికొడుక్కి' అని రాసి ఉంది. విన్న హారిత సిగ్గులమొగ్గ అయి దూరంగా వెళ్ళిపోయింది. శారద బట్టలవీ బీరువాలో దాచేసి పార్శెల్ లోని ఉత్తరం పట్టుకుని పెరటివైపు వెళ్ళింది. ఇక మూడు రోజులుంది శారద పెద్దకూతురు హారిత పెండ్లి. పెరటివైపు పందిళ్లు బాగు చేస్తున్నారు వంట యేర్పాట్లకి. అక్కడున్న కుర్చీలో కూర్చుని ఉత్తరం విప్పింది. "చి॥సౌ॥ శారదని రఘు ఆశీర్వదించి" అని చదివేసరికి శారద కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి. ఎవరూ చూడడం లేదుకదా! అనుకుని చదవటం ప్రారంభించింది. ఎవరో పిలిచారు. గబగబా ఉత్తరం చదవటం ముగించి వెళ్ళి పనిలో మునిగిపోయింది.

పెండ్లికి ముందురోజు హారితను పెండ్లికూతుర్ని చేశారు. శారద బట్టలు తెచ్చి పురోహితుని చేతిలో పెట్టింది. అతను 'మేనమామ రఘురామారావుగారు పెండ్లికుమార్తె నాశీర్వదించి పట్టువస్త్రములు' అంటూ చీరెకు పసుపుపెట్టి శారద కందించాడు. ఆమె తాను బొట్టుపెట్టుకుని కూతురుకి బొట్టుపెట్టి చీరె అందించింది. హారితను బట్టలు కట్టటానికి లోపలికి తీసుకెళ్ళారు. శేఖరం ఆశ్చర్యంగా శారదవైపు చూశాడు. ఆమె కళ్లతోనే జవాబు చెప్పింది. అక్కడే

కూర్చున్న శేఖరం స్నేహితుడూ, హరితకు కాబోయే మామగారూ అయిన కామేశ్వరరావు నవ్వుతూ "ఏమర్రా! పిల్లలకి పెళ్ళిళ్ళు చేస్తున్నా మీరిద్దరూ కళ్ళతో సంభాషణలు మానలేదు!" అంటూ వేళాకోళం చేశారు. శారద సిగ్గుతో తలవంచుకుని లోపలికి వెళ్ళిపోయింది. శేఖరం నవ్వి ఊరుకున్నాడు.

తెల్లవారితే ముహూర్తం. పెందరాళే భోజనాలు ముగించి అంతా పడుకున్నారు. శేఖరం శారద వచ్చి పక్కా, దిండ్లు సరిచేస్తేగాని పడుకోవటం అలవాటులేక వీధి వరండాలో పచార్లు చేస్తున్నాడు. ఇంటిముందు టాక్సీ ఆగింది. ఎవరో ఫుల్‌సూటులో దిగి వస్తున్నాడు. వెనకే ఆయన భార్య కాబోలు - నాలుగేళ్ళ బాబుని ఎత్తుకుని లోపలికి వస్తోంది. శేఖరం ఎదురుగా వెళ్ళాడు. అతను శేఖరానికి షేక్‌హేండ్‌కి చెయ్యి అందించి "నేను రఘునండీ! బావగారూ, నేపాల్ నుంచి వస్తున్నాం. శారదేదీ?" అంటూ గబగబా మాట్లాడేశాడు. శేఖరం సంతోషంగా 'రండి!' అని ఆహ్వానించి 'శారదా' అంటూ కేకేశాడు. శారద బయటికి వచ్చి రఘుని ఆశ్చర్యంగా చూసింది. రఘు అందుకుని "ఏమిటలా చూస్తున్నావు? ఇదిగో జానకి మీ వదినె వాడే మేనల్లుడు. పిల్లలేరీ, అంతా పడుకున్నారా ఏం? పెళ్ళిల్లు కదా! అప్పుడే పడుకుంటారనుకోలేదు. ఉత్తరం అందిందా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు. శారదకి సంతోషంతో నోట మాటరాక నిశ్చేష్టురాలయింది. అతని ఆప్యాయతకు ముగ్ధురాలయింది. కళ్ళు చెమర్చినై. తేరుకుని "ఇప్పుడే పడుకున్నారు పిల్లలు. రండి! లోపలికెళ్దాం" అంటూ జానకి చేతిలో బాబునందుకుని లోపలికి తీసికెళ్ళింది. భార్య ముఖంలో సంతోషం చూసిన శేఖరం తృప్తిగా నవ్వుకున్నాడు. శారద వెనకే లోపలికి వెళ్ళారు జానకీ, రఘూ. ఈసారి శారదను చూసి ఆశ్చర్యపడటం జానకి వంతయింది. పెళ్ళికూతురు తల్లి అనుకోవటానికి వీల్లేకుండా ఉంది శారద. చలువ చేసిన తెల్లచీరె, వాలుజడలో మల్లిచెండు, అప్పుడే ముఖం కడుక్కొని బొట్టుపెట్టుకున్నట్లుంది. నుదుటి కుంకుమ తళుకు, రవ్వలదుద్దుల కాంతులూ కలిసి ఆమె ముఖాన్ని కాంతితో నింపివేస్తున్నై. అన్న, వదినె భోజనాలు చేశారు. వాళ్లకి పడక ఏర్పాట్లవీ చూసి వాకిట్లోకి వచ్చింది. శేఖరం కుర్చీలోనే కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు. శారద పక్క దులిపి దిండ్లు సరిచేసి భర్తను లేపింది. నిద్రముఖంతో శారదను చూసి నవ్వుతూ "చాలా అలసిపోయాను శారూ! పొద్దున్నే లేపుతావు కదూ!" అంటూ పడుకుని నిద్రపోయాడు.

శారద లోపలికివెళ్ళి పడుకుంది. నిద్రపట్టలేదు. ఆమె మనస్సు గతంలోకి జారిపోయింది. . . శారద తల్లిదండ్రులకి ఒక్కతే కూతురు. స్కూలు ఫైనలు పాసవగానే

తండ్రి  చదువు మాన్పించి పెళ్ళి సంబంధాలు చూడటం మొదలుపెట్టాడు. ఇంట్లో ఏం పొద్దుపోక తల్లి వెనకే తిరిగేది. ఎన్ని పన్లు చేసినా రోజులు గడవటం కష్టంగా ఉండేది. ఇలాంటి సమయంలో రఘు పరిచయం కలిగింది. రఘు తండ్రి, శారద తండ్రి దాయాదులు. రఘు తండ్రి రిటైరయి పల్లెటూరయినా స్వంత ఊరని అక్కడే స్థిరపడ్డారు. దాయాదులైనా ఒకే ఇంటిపేరు గలవారని, శారద కుటుంబాన్ని చూస్తే అభిమానం. ఆయనకి  ఆడపిల్లల్లేరు. రఘు ఒక్కడే కొడుకవడం వల్ల చురుకైన శారదని చూస్తే వల్లమాలిన ప్రేమ, అభిమానం.

శారదను చూడటానికి  శేఖరం వచ్చాడు. పిల్ల నచ్చింది.  కట్నం వద్దన్నాడు. శారద తండ్రి రామయ్యగారికి సంబంధం  నచ్చలేదు. రఘు తండ్రి శంకర్‌తో సంప్రతించారు. ఆయన రామయ్యగారు చెప్పినదంతా విని 'చూడు! తమ్ముడూ పిల్లవాడికి తల్లీతండ్రి ఎవ్వరూ లేరు. ఆస్తి లేదు. కాని మంచి గుణవంతుడూ, బుద్ధిమంతుడూ, మన పిల్లను సుఖపెట్టి బాగా చూసుకోగలవాడిలా కనిపిస్తున్నాడు. నీకా కట్నం ఇచ్చే స్తోమతు లేదంటున్నావు. పిల్లవాడు లా చదువుకుంటున్నాడు. నీకున్నదైనా పిల్ల వక్కతే. ఒప్పేసుకో. వీలయినంత త్వరలో  ఆ శుభకార్యం ముగించేద్దాం' అన్నారు. రామయ్య ఇంటికివచ్చి ఆయన సలహాను గురించి మరోసారి ఆలోచించాడు. భార్యకి తన నిర్ణయం చెప్పాడు. ఆమె 'అయ్యో, మరో సంబంధం చూడకూడదూ? అతగాడికి ఎవ్వరూ లేరంటున్నారు. ఇటు మనకీ ఎవ్వరూలేరు. అటు వాళ్ళకీ ఎవ్వరూ లేకపోతే రేప్పొద్దున్న వాళ్ళకష్టసుఖాలను చూచేదెవ్వరు?' అంటూ చాదస్తంగా వాపోయింది.

రఘు శారదకంటే ఏడాది పెద్ద. శారద రఘుని పేరుపెట్టే పిల్చేది. పెండ్లి ముహూర్తం నిశ్చయించారు.  శారదకి  అన్నదమ్ములు లేనిలోటు రఘు తీర్చాడు. పెళ్ళిలో బావగారి కాళ్ళుకడిగి, గడ్డంకింద బెల్లంముక్కపెట్టి 'మా చెల్లెల్నిచ్చి వివాహం చేస్తాం!' అంటూ కాశీప్రయాణం మాన్పించి శేఖరాన్ని తీసుకొచ్చాడు. మళ్ళీ లాజహోమం దగ్గర రఘుని తీసుకొచ్చి దంపతుల పక్కన కూర్చోబెట్టారు. పురోహితుడు మూడుపిడికిళ్ళు పేలాలు రఘుచేత వేయించాడు.  పెళ్ళికొడుకుచేత రఘుకి కొత్తబట్టలు కట్టబెట్టాడు.  రఘు వెళ్ళి శారద తండ్రి నడిగాడు. 'ఎందుకు చిన్నాన్నా? పేలాలు నాచేత వేయించారు?' అని. ఆయన ఆప్యాయంగా రఘు భుజంమీద చెయ్యేసి 'నువ్వు అన్నవవుతావు కాదుట్రా! భవిష్యత్తులో కూడా మీరిద్దరూ అన్నాచెల్లెళ్ళలాగే ఉండాలన్నమాట! అక్క చెల్లెళ్ళకి, అన్నదమ్ములకి మధ్య ఉండే అనుబంధం తెగిపోకుండా ఉండటానికీ, అవన్నీ మరచిపోకుండా ఉండాలనీ మన

పెద్దవాళ్ళు ఎన్నో ఆచారాలని నియమించారు. వాళ్ళకి తక్కువైనప్పుడు నేనిస్తాను సుమా అని మూడు పిడికిళ్ళు అన్నదమ్ములచేత వేయిస్తారు. అంటే - కష్టసుఖాలలో నేనున్నానంటూ అక్కచెల్లెళ్ళని అన్నదమ్ములు ఆదుకోవాలని మన పెద్దవాళ్ళ ఆశయం!' అంటూ వివరించారు. రఘూ పినతండ్రి చెప్పినవి శ్రద్ధగా విన్నాడు.

తరువాత హటాత్తుగా రఘు తండ్రిపోయాడు. చిన్నతనంలోనే తల్లిని పోగొట్టుకున్న రఘు తండ్రిపోయేక ఎవరికీ చెప్పకుండా ఆ వూరు వదిలి వెళ్ళిపోయాడు. తరువాత తాను బాంబేలో ఉద్యోగం చేస్తున్నట్లు శారదకి ఉత్తరం రాశాడు. శారద భర్త 'లా' చదివాడు. అతని చదువు పూర్తయ్యేవరకూ పుట్టింట్లో ఉండేది. కొన్నాళ్ళు అన్నాచెల్లెళ్ళ మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. తరువాత రఘు ఫారిన్ వెళ్తున్నట్లు రాశాడు. తరువాత వాళ్ళిద్దరికీ ఒకరి విషయాలు మరొకరికి తెలియకుండా సంవత్సరాలు జరిగిపోయాయి. శారద తల్లిదండ్రులిద్దరూ కాలగర్భంలో కలిసిపోవటంతో పుట్టింటివారనేవారు లేకుండా పోయారనే విచారం పట్టుకుంది. శారద భర్తకి లాయరుగా మంచి ప్రాక్టీసు, ఏ లోటూ లేకుండా గడిచిపోతోంది. ముత్యాల్లా, ముచ్చటగా ముగ్గురే పిల్లలు. పెద్దపిల్ల హరితకి పదహారేళ్లు. పియుసి పాసవగానే పెళ్ళి చేస్తున్నారు. రెండోది నీల. ఆఖరున రాము. ఏ శుభకార్యం జరిగినా తనవాళ్ళు పుట్టింటితరఫు లేరంటూ కొరతగా ఉండేది.

శారదకి ఆలోచనలతోనే కాలం గడచిపోయింది. కొత్తగా పరిచయం అయిన జడ్జీగారమ్మాయి భోపాలు నుంచి వచ్చింది. ఆమె తన భర్తతోపాటు పనిచేసిన రఘురామారావు కుటుంబం గురించి మాటల మీద చెబుతూ వాళ్ళు నేపాల్ వెళ్ళిపోయారని చెప్పింది. ఆ మాటలతో శారదకి తన అన్న రఘేమోనని ఆశకలిగి నేపాల్ అడ్రస్‌కి రఘుపేర శుభలేఖ పంపింది. ఆ శుభలేఖ అందినట్లుగా వచ్చిన ఉత్తరం పార్శెలు అందింది. అనుకోకుండా రఘు, జానకి రావటంతో శారదకి మనస్సంతా ఆనందంతో నిండిపోయింది. . . గడియారం నాలుగు గంటలు కొట్టటంతో శారద ఉలిక్కిపడి లేచింది. పెరట్లో వంటవాళ్ళని లేపి, ముఖం కడుక్కొని వచ్చేసరికి జానకి లేచి వచ్చింది, 'వదినా! నాకేదైనా పనిచెప్పండి!' అంటూ.

ముహూర్తం వేళ సమీపించింది. అందరూ హడావుడిగా తిరుగుతున్నారు. మంగళస్నానాలు చేయించారు. పెండ్లికొడుకుని పీటలమీద కూర్చోబెట్టారు. పురోహితులు తతంగం జరిపిస్తున్నారు. లోపల హరితను గౌరీపూజ దగ్గర కూర్చోపెట్టి పూజ చేయించారు. రఘు తెచ్చిన ఆకుపచ్చని జరీ పువ్వులున్న పట్టుచీరె, అదేరంగు జాకెట్టూ - ఆకుల మధ్య

గులాబీ పువ్వులా ఉంది హరిత. జానకి హరిత వెనకే కూర్చుని పూలజడ కుడుతోంది. రఘు మనీపర్సుని కొడుకుని వళ్ళోపెట్టుకుని శారద శేఖరాల వెనకే కూర్చున్నాడు. ఈ రెండు రోజుల్లో రఘు ఎంత ఆప్యాయత మనస్సంతా నింపుకు వచ్చాడో శేఖరానికి అర్థమయింది. వాళ్ళు రావటంవల్ల తన భార్య ఎంత సంతోషించిందో తెలుసు.

ముహూర్తంవేళ సమీపించింది. పందిట్లోని పురోహితుడు పెండ్లికూతురుని తీసుకురమ్మన్నాడు. రఘు జరీకండువాని నడుముకి బిగించాడు. గంపతోటి హరితను ఎత్తాడు. హరిత వద్దుమామయ్యా అని బతిమాలింది. సరేనని ఒకచేత్తో గంపను మరోచేత్తో హరితను పట్టుకుని పందిట్లోకి తీసుకువచ్చాడు. శారద ముఖం తృప్తితో నిండిపోయింది. భార్యాభర్తలిద్దరూ ఎంతో ఉత్సాహంగా హరితను తీసుకువస్తున్న రఘునూ, ఆ వెనకే వస్తున్న జానకినీ చూసి హాయిగా నిట్టూర్చారు. రఘూ, జానకీ శారదా శేఖరానికి బట్టలు చదివించారు. కొత్తబట్టలు కట్టుకుని కన్యాదానం చేస్తున్న శారదా, శేఖరాలని చూసి తన బాధ్యత నిర్వర్తించగలిగాననే సంతృప్తి ఆనందంతో రఘు కళ్లు చెమర్చాయి. పెండ్లయిపోయింది. ఆ మధ్యాహ్నం రఘూ, జానకీ ప్రయాణం అయ్యారు.

శారద రఘుని మరో రెండు రోజులు ఉండమని బతిమాలింది. అతను నవ్వుతూ "అసలు నాకు సెలవు దొరుకుతుందనీ, రాగలననీ నమ్మకం లేకనే బట్టలు పార్శెలు ద్వారా పంపాను. చివరికి ఎట్లాగో సెలవు దొరికింది. ఆఫీసుపనిమీద బాంబే రావలసిన పని ఉండి హడావుడిగా వచ్చేశాం. అసలు ముహూర్తం నాటికైనా రాగలననే నమ్మకం నాకు లేదు. ఏదో వచ్చాంగా! ఇకనుంచీ ప్రతీ సంవత్సరం వస్తుంటాంలే!" అన్నాడు. శారదా శేఖరం పెట్టిన బట్టలు కట్టుకుని రఘూ జానకీ బయల్దేరారు. పిల్లలూ ముగ్గురూ కూడా తమకి ఒక మేనమామ, అత్త ఉన్నారని అనుభవించిన ఆనందమే వాళ్ళు వెళ్తుంటే దుఃఖం కలిగించింది. టాక్సీ మలుపు తిరిగేవరకూ చూచి బరువెక్కిన హృదయంతో లోపలికి వచ్చిన శారద కుర్చీలో కూలబడింది. శేఖరం నవ్వుతూ, "హరిత అత్తారింటికెళ్ళిన కన్న, రెండు రోజాలుండి వెళ్ళిన మీ అన్నకోసం బెంగెట్టుకున్నట్టున్నావే!" అంటూ శారద తలనిమిరాడు. ఆమె దుఃఖం ఆపుకోలేక లోనికి వెళ్ళిపోయింది. కళ్ళు తుడుచుకుంటూ. అన్నా చెల్లెళ్ళ అనుబంధాలంటే ఇలాగే ఉంటాయి కాబోలనుకుంటూ ఆమె వెళ్ళిన వైపే చూస్తూ ఆలోచిస్తున్నాడు శేఖరం.

-:o o o:-

# తామ్రపత్రం

సాయంకాలపు ఎండ తన బంగారు కాంతులలో ప్రకృతిని నింపివేస్తున్నది. అస్తమిస్తున్న సూర్యుడు మరొక్కసారి విస్ఫారిత నేత్రాలతో ప్రకృతిని చూసుకున్నట్లుంది. చిరుగాలికి ఊగుతున్న చెట్ల ఆకులు, కొమ్మలు సంతోషంతో కదులుతున్నట్లు కనిపిస్తున్నది. ఆశ్రమం అంతా ప్రశాంతంగా ఉంది. ఇంకా పశువులు ఇంటికి రాలేదు, లక్ష్మి తీరికగా వేపచెట్టుకింద తిన్నెమీద కూర్చుని ఆకాశాన్ని, ప్రకృతిని చూసి పరవశించిపోతున్నది. ఒకవైపు లేత ఎరుపురంగూ, మరోవైపు నీలం, ఇంకోవైపు లేత పసుపురంగూ నింపుకున్న ఆకాశాన్ని చూసి "సంధ్యాకాంత ఏ రంగు చీరె కట్టుకుందామా? అని ఆలోచిస్తున్నట్లుంది" అనుకుని చిన్నగా నవ్వుకుంది.

గేటు తెరిచిన చప్పుడు వినిపించి తన ఆలోచనలను వెనక్కి నెట్టి తలెత్తి చూసింది, మనుమరాలు గిరిజ కాలి పట్టీలు చప్పుడవుతుంటే వచ్చి లక్ష్మి మెడచుట్టేసి ఆయాసపడుతూ, "బామ్మా! మీకు తామ్రపత్రం ఇస్తారట, ఢిల్లీ రమ్మని ఉత్తరం వచ్చింది!" అని గబగబా చెప్పేసి బామ్మ చేతిలో కవరు పెట్టింది. లక్ష్మి ఆశ్చర్యంగా "ఆఁ! నాపేర వచ్చిందా ఉత్తరం? ఆ గంతులేమిటే అమ్మడూ! వెళ్ళి ఆ కిటికీలో నా కళ్ళజోడిలా పట్రా!" అన్నది. గిరిజ కళ్ళజోడు కోసం వెళ్ళింది. లక్ష్మి తనలో తానే "నాకు తామ్రపత్రం ఇస్తారా? ఎందుకు? స్వాతంత్ర్యోద్యమంలో పని చేసినవారందరికి ఇస్తున్నారట కదూ! స్వాతంత్ర్యంవచ్చి పాతికేళ్ళు గడిచిపోయాయి. రజతోత్సవాలన్నమాట!" అనుకుంటూ వుంటే - గిరిజ కళ్ళజోడు, కవరు బామ్మ చేతిలో పెట్టి వెళ్ళిపోయింది.

లక్ష్మి కళ్ళజోడు తుడిచిపెట్టుకుని " అమ్మయ్య! ఇప్పటికి కవరు నా చేతికి వచ్చింది!" అని కవరు తడుముకుంటున్నది. కవరు తడుముతూ" స్వాతంత్ర్యోద్యమంలో పనిచేసినందుకు గుర్తింపా! ఛీ! ఈ గుర్తింపులెందుకు? తామ్రపత్రాలు, తాటాకుముక్కలు నాలిగ్గీసుకోనా? అయినా అప్పుడు ఇవేమీ మనస్సులో ఉండేవికావు, మనుష్యుల మనస్సులు నిర్మలంగా ఉండేవి, ఇప్పటిలా స్వార్థం, కుళ్ళు మనస్సుల్లో ఉండేవికావు. ఆవేశంగా కార్యరంగంలోకి దూకేవారు. ఇప్పటివాళ్ళు నెమ్మదిగా ఆలోచిస్తారు 'దానివల్ల స్వప్రయోజనం ఏమిటి?' అంటూ.

అంతా నిన్న మొన్నటిలా ఉంది, స్వాతంత్ర్యం వచ్చి ఇరవై అయిదు సంవత్సరాలు జరిగిపోయాయి!" అనుకుంటూ చేతిలో కవరు విప్పకుండానే వెనక్కి జరిగి చేరబడి కూర్చుంది ఆలోచిస్తూ. ఆమె మనస్సు గతంలోకి వెళ్ళింది. . . .

ఆ కాలంలో ఆడపిల్లలు స్కూలు కెళ్ళి చదువుకోవటం అంటే గొప్ప విశేషం. ఇంట్లోనే పెద్దవాళ్ళ దగ్గర రుక్మిణీ కళ్యాణం. గజేంద్ర మోక్షం అవీ చదువుకుని సంగీతం నేర్చుకునేవారు, కలవారి ఇళ్ళల్లో సంస్కృతం కూడా చెప్పించేవారు. మా నాన్న మాత్రం ఆడపిల్లల్ని కూడా స్కూలుకి పంపడం చూసి, కొందరు "డాక్టరుగారికేం? ఆడపిల్లల్ని మగపిల్లల్తో పాటు స్కూలుకి పంపి చదువులు చెప్పిస్తున్నారు! గొప్పవాళ్ళు ఏం చేసినా చెల్లుతుంది" అనేవారు. మొగపిల్లల్తో సమానంగా ఆడపిల్లలు చదువుకోవాలని మా నాన్నగారి ఆశయం. ఆయనకి ఆడపిల్లలకి చిన్నతనంలో పెళ్ళి చేయడం ఇష్టంలేదు. అయినా అత్త, బామ్మల పట్టుదల వల్ల నా పెళ్ళి చిన్నప్పుడే - అంటే, నాకు ఊహ సరిగ్గా తెలియకముందే జరిగింది.

బావ మద్రాస్‌లో ఎంబిబియస్ చదివాడు అప్పట్లో మద్రాసులో చదవటం గొప్ప. అందులో ఎం.బి. బి. యస్, చదవటం ఇంకా గొప్పగా ఉండేది. మా నాన్న ఎల్.ఎమ్.పి. డాక్టరు. అప్పుడు చాలామంది ఎల్. యం. పి డాక్టర్లే. బావ చదువు పూర్తయేదాకా స్కూలు కెళ్ళి చదువుకున్నాను. అమ్మలక్కలమాటలు విని సహించలేక అమ్మ అప్పుడప్పుడు నాన్నతో "పెళ్ళయిన పిల్లను బడికి పంపిస్తున్నామని అందరూ వింతగా చెప్పుకుంటున్నారు లక్ష్మికింక చదువుచాలండీ!" అనేది. ఆయన నవ్వి "పోవే! ఊళ్ళోవాళ్ళు లక్ష అనుకుంటారు, అల్లుడికిష్టమైంది. అయినా బండిలో పంపిస్తున్నాం కదా?" అని తేలిగ్గా తీసేశారు.

మాకు 'డబ్బుకి ఇబ్బంది' అంటే తెలియదు, మంచినీళ్ళు గ్లాసుతో ముంచుకుని తాగాల్సిన అవసరంలేదు. పొద్దున్నే శాస్త్రులుగారు సంస్కృత పాఠం చెప్పి వెళ్ళేవారు. తరువాత స్కూలుకి వెళ్ళిరావటం, సాయంత్రం ఒక అరగంట సంగీత పాఠం. రాత్రి నాన్న పక్కలో కూర్చోబెట్టుకుని పాటలు పాడించి వినేవారు. బావ చదువుపూర్తయ్యేసరికి నేను స్కూలు ఫయినలు పాసయ్యాను. తరువాత అందరి ఆడపిల్లల్లాగే బరువెక్కిన హృదయంతో అత్తవారిల్లు చేరాను.

అత్తవారింటికి వెళ్ళాక నా జీవితం క్రొత్త మలుపు తిరిగినట్లయింది. అప్పటికే మామయ్యగారు న్యాయవాద వృత్తి విడిచిపెట్టి స్వాతంత్ర్యోద్యమంలోకి దూకారు. తండ్రిని

చూసి ఈయనగారు కూడా ప్రభుత్వోద్యోగం చెయ్యనన్నారు. ప్రాక్టీసు పెట్టుకున్నారు. తండ్రిగారి పలుకుబడి, ఈయన చేతిచలవ అన్నీ కలిసి వచ్చి అదృష్టం వరించింది. అంతా లక్ష్మి కాలుపెట్టిన వేళమంచిది. దాని అదృష్టం అన్నారు.

సత్యాగ్రహోద్యమం ముమ్మరంగా సాగు రోజులవి. కాంగ్రెసు సభలు ఎక్కడ జరిగినా మామయ్య గారు వెళ్ళేవారు. ఇంట్లో కూడా చిన్న సభలు జరుగుతూ ఉండేవి. మా ఇంటికి ప్రకాశం పంతులు గారూ, కొండా వెంకటప్పయ్య గారు మొదలయిన పెద్దలు వస్తుండేవారు. అందరూ వీధరుగుల మీద కూర్చుని, దేశం గురించీ, బ్రిటిష్ ప్రభుత్వం గురించీ, స్వాతంత్ర్యోద్యమం గురించీ, గంటలు గంటలు చర్చించుకునేవారు. నేను ఏ హాలు కిటికీ దగ్గరో, పక్క గదిలోనో కూర్చుని ఆసక్తిగా వినేదాన్ని. పట్టాభిగారన్నా కాశీనాథుని నాగేశ్వరరావుగారన్నా నాకు ప్రత్యేకమైన అభిమానం ఉండేది. అత్తయ్య ఎప్పుడూ, గృహకృత్యాల్లో అతిథి మరియాదల్లో మునిగింఉడేది. నాకు పనేమీ ఉండేదికాదు. ఆయనగారు హాస్పిటలుకి వెళ్ళేవరకూ కావలసినవి అందించటం కబుర్లు చెప్పటం తరువాత గదిలో కూర్చుని పేపర్లు, పుస్తకాలు చదువుకోవటమే నా దినచర్య.

క్రమంగా మా ఇంట్లో ఖదద్దరు వాడకం మొదలైంది. మొదట తువ్వాళ్ళు. దుప్పట్లు తెచ్చారు. కొత్తలో దుక్క గుడ్డలంటూ విసుక్కున్నా, తరువాత వాటి విలువ తెలుసుకున్న అత్తయ్య వాటిని చాలా గౌరవించేవారు తరువాత చీరెలు, ధోవతులు తెచ్చారు. ఈయనగారు కూడ ఖద్దరు సూట్లూ కుట్టించారు. నేను మాత్రం ఖద్దరు చీరెలు మొయ్యలేనని వద్దన్నారు. అప్పుడే గాంధీగారు ఆంధ్రదేశం పర్యటిస్తూ మా ఊరొచ్చారు. మేమంతా మహాత్ముణ్ణి దర్శించాం. ఉద్యమంకోసం మహాత్మాజీ విరాళాలిమ్మన్నారు. బీదా గొప్పా భేదంలేకుండా ఆదరిద్రనారాయణుడడిగిందే దడవుగా అంతా కానక్కలు కుప్పలుగా పోశారు. స్త్రీలంతా తాము ధరించిన నగలు తీసిచ్చేస్తున్నారు. నాలో ఆవేశం పొంగింది. ఏం చేస్తున్నానో నాకే తెలీదు, పక్కన అత్తయ్య ఉన్నట్టుకూడా గమనించలేదు. నా చేతికున్న బంగారు గాజుల తీసి మహాత్మాజీ పాదాల దగ్గర ఉంచాను, ఆ కళ్ళలో మెరుపు ఎప్పటికీ మర్చిపోలేను. చిరునవ్వుతో నా చెయ్యి పట్టుకుని నా పేరడిగారు. చెపుతూ ఫలానావారి కోడల్నని చెప్పాను. గుంపులో ఉన్న మామయ్యగారిని పిల్చి " అదృష్టవంతుడివయ్యా!" అన్నారు. అబ్బ! ఆ మహాత్ముడి పాదాలదగ్గర మోకరిల్లినపుడు కలిగిన తన్మయత్వం ఇప్పటికీ తల్చుకుంటే

వళ్ళు జలదరిస్తుంది. మహాత్మాజీ నన్ను దగ్గర కూర్చోబెట్టుకుని నా తల నిమురుతూ "లక్ష్మీ! ఇంత చిన్న వయస్సులో నగలమీద వ్యామోహం తెంచుకుని గాజులిచ్చేశావు! కాని మళ్ళీ చేయించుకొని వేసుకోకూడదుసుమా!" అన్నారు. నేను వేసుకోనని వాగ్దానం చేశాను. మర్నాడు పేపర్లో "ఫలానావారి కోడలు గర్భవతి, నిండు చూలాలు మహాత్మాజీకి గాజులిచ్చేసింది!" అని పడింది. తెలిసినవారంతా చూడడానికి వచ్చారు. మా వారికిగాని, మా అత్తమామలకిగాని నేను చేసినపని అసమంజసంగా తోచకపోవడం నాకు చాలా సంతృప్తి కలిగించింది.

ఉన్నట్టుండి మా మామయ్యగారు అరెస్టయ్యారు. ఆయన జైలుకెళ్ళడం మాకు పెద్ద దెబ్బ. అప్పుడు అత్తయ్య ముఖంలో చూసిన హావభావాలు మరపురానివి. ఆ వార్త వినగానే ఆమె కళ్ళు శ్రావణమేఘాల్లా వర్షించాయి. తరువాత ఒక్క అయిదునిమిషాల్లో తేరుకుని, కొడుకుతో "బాబూ ప్రభాకరం! మీ నాన్న అదృష్టవంతులు!" అన్నారు. పచ్చగా పసుపురాసిన ముఖంమీద రూపాయంత కుంకుంబొట్టు, ఎఱ్ఱంచు ఖద్దరు చీరె, తల్లో మందారంతో పార్వతీదేవిలా__ఉండేది అత్తయ్య.

తండ్రి అరెస్టవగానే కొడుకు కూడా ప్రాక్టీసు తగ్గించేసి రాజకీయాల్లోకి దిగారు. ఇంట్లో అత్తయ్య ఒక్కత్తే ఉండలేదని నేను పురిటికి పుట్టింటికి వెళ్ళలేదు. ఆయన నన్ను దగ్గరకు పిల్చి 'నీకు వెళ్ళాలని ఉంటే వెళ్ళు! అమ్మ సంగతి నేను చూసుకుంటాను' అన్నా, అత్తయ్యను వదిలివెళ్ళటానికి నాకే ఇష్టంలేక వెళ్ళలేదు. అత్తయ్య జైల్లో ఉన్న మామయ్య గురించీ, నా గురించీ వేయిదేవుళ్ళని ప్రార్థించేది.

సుఖప్రసవం జరిగింది. అబ్బాయి పుట్టాడు. మూడోరోజు పత్యం పెట్టారు. ఆ వేళయినా నన్ను పేపరు చదువుకోనిమ్మని ఆయన్ని ప్రార్థించి ఒప్పించాను. పేపరునిండా ఉద్యమం గురించిన వార్తలే! అరె! ఏమిటి? నాయకులు అంతా అరెస్టయారా! స్త్రీలు కూడా రంగంలోకి దిగుతున్నారా? అవును మరి! భారత నారీమణులు అవసరమైతే అపర కాళికల్లా విజృంభించగలరు. ఝాన్సీ లక్ష్మి, అహల్యాబాయి మొదలైన వీర వనితలు పుట్టిన ఈ దేశంలో మేమూ పుట్టాం.

మరునాడు మధ్యాహ్నం నేను పేపరు చదువుతూఉంటే అత్తయ్య వింటోంది. పొద్దుననగా వీధిలోకి వెళ్ళిన ఆయన ఇల్లు చేరలేదు.

వీధిలో కారాగిన చప్పుడు, ఎన్నో బూట్లశబ్దాలు వినిపించాయి ఆయన లోపలికొచ్చి "లక్ష్మీ!" అన్నారు. నేను తలెత్తి చూశాను. మెడనిండా పూలదండలు, నుదుట తిలకం. అలసిన ముఖం. నేను బాలెంతననే విషయం మరచి ఒక్క ఉదుటున ఆయన దగ్గరకెళ్ళి నిలబడ్డాను. ఆయన అరెస్టయ్యారని నాకర్థం అయిపోయింది. "లక్ష్మీ! దేశమాత దాస్య శృంఖలాల్ని విడిపించటానికి వెళ్ళేవాళ్ళతో వెళుతున్నాను. ఇక అమ్మనూ, బాబునూ చూచుకునే బాధ్యత నీకు అప్పగిస్తున్నాను. జాగ్రత్త! వందేమాతరం!" అంటూ "చిరునవ్వుతో సాగనంపాలి!' అంటూ తనగుండెలో తలదాచుకుని ఏడుస్తున్న నా గడ్డం పట్టుకుని తలపైకెత్తి తన కండువాతో నా కన్నీరు తుడిచారు. ఆ స్పర్శతో నాలో నవచైతన్యం ప్రవేశించింది. 'వందేమాతరం' అంటూ ఆయనకు నమస్కారం చేశాను. అత్తయ్య నిశ్చేష్టురాలై గోడకు చేరబడిపోయింది. కొడుకు తల్లిననునయిస్తున్నారు. గుమ్మందగ్గరున్న పోలీసుల కళ్ళల్లో నీరు చూసి, ఆశ్చర్యపోయాను. నన్ను నేను చూసుకుని సిగ్గుపడ్డాను. ఒంటినిండా పసుపు. నడికట్టులో తెల్లటి నేతచీరె, ఇల్లంతా జనం నిండిపోయారు. నేను ఒకచేత్తో బాబు నెత్తుకుని, మరోచేత్తో అత్తయ్యను పట్టుకుని, ఆయన్ని వీధివరకూ సాగనంపాను. ఆయన మాకేసి చిరునవ్వుతో చూసి, చెయ్యి ఊపి "వందేమాతరం" అంటూ పోలీసు వాన్‌లో ఎక్కి వెళ్ళిపోయారు. నా పెదవులు, అత్తయ్య పెదవులు కూడా "వందేమాతరం" అంటూ అస్పష్టంగా ఉచ్ఛరించాయి.

తరువాత లోపలికొచ్చాం. దుఃఖం కట్టలు కట్టలుగా తెంచుకుంది. బాబు పసివాడు. వాడు పొత్తిళ్ళలో నిశ్చింతగా ముడుచుకుపరుడుకున్నాడు. అత్తయ్య ఆ సమయంలో చూపిన మనోనిబ్బరం అద్వితీయం. నన్ను దగ్గరకు తీసుకుని ఓదార్చింది. "పిచ్చిదానా! ఏడుస్తారటే? నిన్నొదిలి వెళ్ళాలనిగానీ లేకుంటే నేనూ అరెస్టయేదాన్నే. ఆ అదృష్టం ఉండొద్దూ!" అంటూ. రాజకీయ ఖైదీలకు ప్రత్యేక సదుపాయాలు ఉంటాయని తెలిసికూడా మా వాళ్ళగురించి ఆరాటపడ్డాను. క్రమంగా అలవాటు పడ్డాను. మా నాన్నతప్ప మిగతా చుట్టాలు బంధువులు అంతా ఆరోజుల్లో మా కుటుంబాన్ని విమర్శించినవారే.

ఆ రోజుల్లో కాలక్షేపానికి మొదలుపెట్టిన రచనా వ్యాసంగం ఈ నాటికీ నన్ను వదలలేదు. ఆయన ప్రోద్బలంతో రాసిన నా కథలు, వ్యాసాలు గృహలక్ష్మి, ఆంధ్రమహిళ, భారతి లాంటి పత్రికల్లో పడేవి. అదేమిటో, అప్పుడదో ఆనందం. రాట్నం వడికేవారం.

వడుకుతూ ఆ రోజుల్లో వచ్చిన జాతీయగీతాలు పాడేదాన్ని, విదేశవస్త్ర బహిష్కరణ నాడు పట్టుచీరెలు, సిల్కుచీరెలు అన్నీ మంటపెట్టి స్నానం చేసి, ఖద్దరు చీరె కట్టుకుని నుంచున్న నన్ను ఆయన ఆశ్చర్యంగా చూశారు.

స్వాతంత్ర్యం వచ్చింది, వచ్చిందన్నారు. ప్రజల్లో ఆనందోత్సాహాలు మిన్నుముట్టాయి. కాని నేడు ప్రజలకు కడుపునిండా తిండి, ఒంటినిండా గుడ్డా కరువయ్యాయి.

"ప్రభుత్వం ఏం చేస్తోందంటారు" కొందరు. "ఏం చెయ్యగలదు?" అంటున్నారు కొందరు. నా మట్టుకు నాకయితే ఆ స్వాతంత్ర్యం కోసం కలిసికట్టుగా పనిచేసిన రోజులే బాగున్నాయి. మా అమ్మాయి మాయ జైల్లో పుట్టింది. దానికన్నీ వాళ్ళ నాన్న బుద్ధులే. ఈయన అల్లుణ్ణికూడా ఖద్దరే కట్టుకోమని ఆదేశించారు ఖద్దరు బట్టలే పెట్టారు. పాపం! అతను సరేనన్నాడు. మంచివాడు గనుక తండ్రీకూతుళ్ళ ఆటలు సాగనిచ్చాడు.

మామయ్యగారితోపాటు అత్తయ్య జైలుకెళ్ళి అక్కడి ఆహారం సరిపడక అక్కడే కన్నుమూసింది. మామయ్యగారు మాత్రం దేశానికి స్వాతంత్ర్యం వచ్చినరోజు చిన్నపిల్లాడిలా ఉత్సాహపడ్డారు. ఉద్యమంలోకి దిగి ఆస్తంతా అమ్ముతూ వచ్చారు. ఆఖరికి మిగిలిన పదెకరాల్లో రెండెకరాలు అమ్మి, స్వాతంత్ర్యం వచ్చిన ఆగస్టు పదిహేనోతేదీ ఊళ్ళోఉన్న బీదలందరికీ అన్నదానం, వస్త్రదానం చేయించారు. తరువాత మూడు నెలలకే మామయ్య గుండెపోటుతో కన్నుమూశారు. పత్రికలలో వేశారు. మిత్రులొకరు ఆయన గురించి ప్రత్యేకవ్యాసం రాశారు, అంతే! అయిపోయింది.

ఈయన సరేసరి! మళ్ళీ వృత్తిమీద శ్రద్ధ చూపించలేదు. కొన్నాళ్ళు ఉత్తరదేశంలో ఆశ్రమాల్లో ఉండి వచ్చాం. ఆయనకి ఎక్కడా నచ్చలేదు. ఉన్న పొలం అంతా అమ్మేశారు. రాజకీయ బాధితులకి ప్రభుత్వం కొంత పొలం ఇచ్చింది, మా వూరికి దూరంగా. ఆ పొలం పక్కనే మరికొంత పొలం కొన్నారు. మొత్తం ఇరవై ఎకరాలయింది. అక్కడే పాక వేసుకుని కాపురం పెట్టాం. స్వంత వ్యవసాయం ప్రారంభించాం. రసాయన ఎరువులు వెయ్యకుండా పండించాలని వారి ఆశయం. భూదేవి మా శ్రమకి సంతసించింది. బంగారం పండింది, మేము పండించిన ధాన్యానికేగాక, చిలకడదుంపలకి, అరటిపళ్ళకి ప్రతి సంవత్సరం బహుమతులు లభించేవి. వ్యవసాయానికీ పాడికీ పశువుల్ని కొన్నాం. అవన్నీ మా పిల్లలనే అనుకున్నాం.

రెండేళ్ళలో పంపుసెట్టు తెప్పించారు. కరెంటు వచ్చింది. ఎందుకో ఆయన తన వైద్యవృత్తినే మరచిపోయారు. ఇంగ్లీషు వైద్యం అని కాబోలు. గురుకుల పద్ధతిని పాఠశాలప్రారంభించారు. కొందరు టీచర్లను కుటుంబాలతోసహా పిలిపించారు. వాళ్ళకి తలో పాక వేయించారు. ప్రతీ పాకకి ముందర జాజిపందిరో, మల్లిపందిరో ఉండాల్సిందే! వెనకవైపు కూరగాయల పందిళ్ళు. చుట్టుపక్కల పల్లెల్లో పిల్లల్ని స్కూల్లో చేర్చారు. వాళ్ళకి భోజనాలు వగైరా మా ఇంట్లోనే, వాళ్ళెంతో ఉత్సాహంగా నన్ను నోరారా "అమ్మా!" అని, ఆయన్ని 'బాబూ' అని పిల్చేవారు. ఆశ్రమంలో ఎవరూ కాఫీ తాగకూడదు, ఎవ్వరికీ ఇవ్వం. మా పిల్లలు ఇంగ్లీషు చదువులు చదవలేదు. పట్నం నుంచి అప్పుడప్పుడు మా మేనకోడళ్ళు. మేనల్లుళ్ళు సెలవుల్లో వచ్చేవారు. వాళ్ళకోసం ఆయన వేపచెట్టుకు ఉయ్యాల కట్టించేవారు. వాళ్ళతో పాటు ఈయన ఉత్సాహంతో పాటలు పాడుతూ ఉంటే నా మనస్సు ఆనందంతో పరవశించేది. అయిదేళ్ళలో ఆశ్రమము నందన వనంగా తయారయింది, బియ్యం కొనక్కరలేదు. కూరలు కొనాల్సిన అవసరంలేదు. స్వయం సమృద్ధిగా ఉండాలనే ఆశయం నెరవేరిందనే చెప్పాలి. ఆశ్రమవాసం మొదలయ్యాక మా ఇద్దరి మధ్య అనుబంధాలు ఎక్కువయ్యాయి. "లక్ష్మి! లక్ష్మి!" అన్న పిలుపుతోనే ఆయన సగం రోజు గడిపేవారు. ప్రతి చిన్న విషయంలో నన్ను సంప్రదించేవారు.

ఉన్నట్టుండి ఆయనకు గుండెనొప్పి వచ్చి రెండు రోజులు బాధపడ్డారు. ఆశ్రమభారం నా మీద పెట్టి ప్రశాంతంగా కన్నుమూశారు. ఇప్పుడు నేను తామ్రపత్రం పుచ్చుకోవడానికి వెళ్ళాలంటే ఆశ్రమపు బాధ్యత ఎవరిమీద పెట్టి వెళ్ళాలో ఆలోచించాలి. మాయకి ఉత్తరం రాయాలి" అని ఆలోచిస్తున్న లక్ష్మి ప్రార్థన వినపడడంతో లేచి ప్రార్థన జరిగే చోటుకి వచ్చి కూర్చుంది. గాంధీగారి ఫోటో మీదనే దృష్టి నిలిపి ప్రార్థన వింటూ కూర్చున్న లక్ష్మికి ఫోటోలో ఉన్న గాంధీజీ చిరునవ్వుతో వెళ్ళమని ఆజ్ఞాపించినట్లు తోచింది.

వెంటనే లేచి నెమ్మదిగా "నన్ను వెళ్ళమంటారా బాపూ! సరే వెళ్తాను బాపూ! ఇంతకు ముందులాగే ఇకముందుకూడా నా శక్తికొలదీ దేశసేవ చేసేందుకు నాకు శక్తి ప్రసాదించండి! కాని అప్పుడు త్యాగాలు చేసిన వ్యక్తులెంతమంది అజ్ఞాతంగా ఉన్నారో! వారందరికీ జోహార్లు!" అనుకుంటూ తన పాకవైపు వడివడిగా వెళ్ళిపోయింది లక్ష్మి.

-:0 0 0:-

# ఆంతర్యం

అప్పుడే సూర్యాస్తమయం అయిందేమో - పడమటి దిక్కు సిందూరపు కాంతితో మెరిసిపోతోంది. చదువుతున్న కల్నల్ రావ్‌కి పుస్తకంలో అక్షరాలు సరిగ్గా కనపడటంలేదు. పుస్తకం మూసేసి వెళ్ళి కిటికీ దగ్గర నుంచున్నాడు. చుట్టూ ఉన్న కొండలు సాయంత్రపు శోభలతో అలంకరించు కొంటున్న సంధ్యాకాంత చెలికత్తెల్లా ఉన్నై, ఆ కొండల్ని తాకుతూ కదులుతున్న పల్చని మబ్బులు సంధ్యాకాంత కట్టుకొనే చీరెల్లా ఉన్నై, దూరంగా కనబడుతున్న హాస్పిటల్ బిల్డింగులో లైట్లు వెలిగాయి. నర్సులు డ్యూటీలు మారుతున్నారు. మిలిటరీ హాస్పిటలేమో! పాపం రోగులను చూడడానికి వచ్చే బంధువులుండరు స్నేహితులు సహోద్యోగులు మాత్రం అక్కడి రోగుల్ని పరామర్శించడానికి వస్తుంటారు. స్వంతవాళ్ళకన్న ఎక్కువగా చూసుకొంటారు. అక్కడివారంతా తమవాళ్ళందరినీ దూరం చేసుకుని దేశరక్షణకోసం వచ్చినవాళ్ళే. ప్రతివాడికి ఒకటే లక్ష్యం - దేశరక్షణ.

అలా నుంచున్న కల్నల్ రావ్‌కి తాను ఆర్మీలో చేరిన కొత్తరోజులు గుర్తుకొచ్చాయి. మొదట్లో ఇంటిమీద చాలా బెంగగా ఉండేది. అస్తమానూ అమ్మా, నాన్న గుర్తుకొచ్చేవారు. తీరికవేళలో దిగులుగా కూర్చుని ఆలోచించేవాడు. రానురాను అందరితో కలసిమెలసి మెలగటం అలవాటయింది. రావ్‌కి అక్కడి ప్రతీవాడూ తనవాడే ననిపించేవాడు. తీరిక సమయాల్లో ఒకరి కష్టసుఖాలు మరొకరితో చెప్పుకోవడం, అనారోగ్యంగా ఉన్నప్పుడు ఒకరికొకరు సేవచెయ్యడంలాంటి పద్ధతులు రావ్‌కు చాలా నచ్చాయి. కాళ్ళు, చేతులూ పోగొట్టుకొని చికిత్స పొందుతున్నా, గుండు దెబ్బతగిలిన గుండెకి ఆపరేషను జరిగినా రోగులు ఇంటిదగ్గర వాళ్ళని గుర్తు చేసుకునేవారుకాదు. గాయపడిన తోటివారెట్లా ఉన్నారోనని డాక్టర్లనడిగి తెలుసుకునేవారు.

మసక చీకటిలో నడుంమీద చేతులుంచుకుని నుంచున్న కల్నల్ రావ్ ఒక శిలావిగ్రహంలా కనబడుతున్నాడు. అతని మనస్సులోని ఆలోచనలు ఎక్కడెక్కడికో తీసుకుపోతున్నై. అక్క జ్ఞాపకం వచ్చింది. నిస్వార్థంగా "మానవసేవే మాధవసేవ" అన్న ధ్యేయం పెట్టుకున్న డాక్టరు ఆమె. పాపం, జీవితంలో దెబ్బతిన్న మనిషి ఆమెకి స్త్రీలందరూ కోరుకునే

మాతృత్వం, సాంసారిక జీవితం లేవు. సన్యాసినిలా, విరాగిలా బ్రతుకుతోంది. ఆమె పైకి ఎంత కఠినంగా కనిపిస్తుందో ఆమె మనస్సంత సుకుమారమని రావ్ ఒక్కడికే తెలుసు. ఆమెకోసం రావ్ కూడా వివాహం చేసుకోలేదు- "ఆ బంధంలో పడితే ఇదివరకులా ప్రేమాభిమానాలు అక్కకి పంచలేనేమో "అనో ఏమో! తానుకూడా తన జీవితాన్ని మానవసేవకే వినియోగింపదల్చాడు. తను చేస్తున్న పని త్యాగమనుకోలేదు. తను వివాహం చేసుకుని సంసారంలో పడిపోతే అక్క వంటరిగా ఉండిపోతుందని భయం. ఎంత దూరంలో ఉన్నా ఆ అక్కాతమ్ముళ్ళకి ఒకరిపై ఒకరికి ఎంత ప్రేమాభిమానలు ఉన్నాయో వాళ్ళ మనసులకే తెలుసు.

ఆలోచనల ప్రవాహంలో పడ్డ కల్నల్ రావ్ స్విచ్ వేసిన చప్పుడువిని వెనక్కి తిరిగాడు. లైట్ వెలిగింది. ఆర్డర్లీ 'టీ' ట్రే తెచ్చి బల్లమీద పెట్టి శాల్యూట్ చేశాడు. రావ్ కూర్చుని 'టీ' తీసుకున్నాడు . 'ఉత్తరం రాలేనట్టుంది!'. అనుకున్నాడు. వాతావరణం బాగులేకపోతే టపా రాదు. సిగరెట్ వెలిగించాడు. రెండు దమ్ములు పీల్చి ఏదో జ్ఞాపకం వచ్చినట్టు 'హాస్పిటల్ వరకూ వెళ్ళొస్తాను!' అని ఆర్డర్లీతో చెప్పి బయల్దేరాడు. కొండప్రదేశం అవడం వల్ల హాస్పిటల్ ఎదురుగా కనిపించినట్లున్నా రెండు మైళ్ళ దూరం ఉంది. రావ్ బయటికి రాగనే డ్రైవరు లేచినుంచుని శాల్యూట్ చేశాడు. వద్దన్నట్లు చేత్తోనే సంజ్ఞచేసి కాలినడకనే బయల్దేరాడు కల్నల్ రావ్.

సన్నటి కొండదారుల్లో సాయంత్రం పూట నడవటం రావ్‌కి ఇష్టం. పెదవుల మధ్య సిగరెట్ ఎఱ్ఱగా మెరుస్తుంటే పాంటుజేబుల్లో చేతులుపెట్టుకుని హుందాగా నడిచిపోతున్నాడు. సన్నటి కాలిబాటవెంబడి నడుస్తుంటే వచ్చే అడవి పూలపరిమళం అతనికి ప్రతిరోజూ కొత్తగానే ఉంటుంది. అక్కడక్కడ కనిపించే పొదలు ఎవరో గుంపులు గుంపులుగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నట్లు ఆ నిశ్శబ్ద వాతావరణంలో కల్నల్ రావ్ బూట్ల చప్పుడు లయబద్ధంగా కొండల్లో ప్రతిధ్వనిస్తోంది.

కీచురాళ్ళ ధ్వనీ, దూరంగా అక్కడ క్కడ మిలిటరీ ట్రక్కులు కదిలిన శబ్దాలు తప్ప మరే సందడీ లేని ప్రదేశం. రావ్ ఆలోచిస్తున్నాడు మళ్ళీ తనవాళ్ళ గురించి. "ఉత్తరం వచ్చి చాలా రోజులైంది.ఈసారి సెలవు పెట్టినప్పుడు అందరం కలసి ఎక్కడికైనా వెళ్ళాలి. ఈ యాంత్రిక జీవితాన్నించి తప్పించుకోవాలి." అనుకున్నాడు రావ్.

కల్నల్ రావ్ హాస్పిటల్ చేరేసరికి పూర్తిగా చీకటిపడింది. రావ్ హాస్పిటల్ అంతటికీ పెద్ద అధికారి. విధి నిర్వహణలో కూడ అతవి పెద్దతనం ప్రస్ఫుటంగా కనబడుతుంది. గేటు దగ్గర సెంట్రీ అటెన్షన్‌లో శాల్యూట్ చేశాడు. రావ్ వేళకాని వేళల్లో హాస్పిటల్‌కి రావటం మామూలే. అందుకే హాస్పిటల్ ఉద్యోగులంతా అతి జాగ్రత్తగా వ్యవహరిస్తుంటారు. హాస్పిటల్ దగ్గరికి వచ్చేసరికి ఉత్సాహం ఇనుమడించింది. రెండంగల్లో మెట్లన్నీ ఎక్కేసాడు. అతడి చురుకుదనాన్ని, విగ్రహాన్నీ చూస్తే అతనికి నలభై అయిదేళ్ళు దాటాయని ఎవ్వరూ అనుకోరు. తనతో పనిచేసే ప్రతీవ్యక్తి యోగక్షేమాలు తనవే ననుకుంటాడు రావ్. అతని ఎడమ కణతమీది గాయం మచ్చ చూసి క్లబ్బులో ఒక లెఫ్టినెంటు నవ్వుతూ అడిగాడు: "మీకు యుద్ధంలో దెబ్బతగిలిందాండి!" అని. రావ్ నవ్వుతూ "లేదు! చిన్నప్పుడు నీలాంటి కొంటె తమ్ముడు రాయిపుచ్చుకొట్టాడు!" అని మచ్చ చేత్తో తడుముకున్నాడు.

కల్నల్ రావ్ హాస్పిటల్‌లో ప్రవేశిస్తూనే నోటీసు బోర్డు దగ్గరకెళ్ళి డ్యూటీలో ఉన్న డాక్టర్ల పేర్లు చూసి సంతృప్తిగా తల పంకించాడు. రమేశ్ అనే కెప్టెన్ డ్యూటీలో ఉన్నాడు. మెరికలాంటి కుర్రాడు. బంగ్లా యుద్ధంలో రావ్‌తోపాటే ఉండేవాడు. పట్టుమని పాతికేళ్ళయినా నిండని రమేశ్ ధైర్యసాహసాలు, సమయస్ఫూర్తి చూసి ఆశ్చర్యపోయేవాడు రావ్. అతని తల్లితండ్రుల్ని తల్చుకుని జాలిపడేవాడు. మరో కుర్రాడు మనోహరన్. చాలా చురుకైన వాడు. కేరళ నుంచి వచ్చాడు. అతనూ రమేశ్‌లాగే కల్నల్ రావుకి ప్రీతిపాత్రుడు. మనోహరన్‌కి పెళ్ళయింది. ఇద్దరు పిల్లల తండ్రి. తీరిక దొరికితే భార్యాపిల్లల ఫోటోలు ముందుపెట్టుకుని కూర్చునేవాడు.

హాస్పిటల్‌లో ప్రవేశించి, సర్జికల్ వార్డులన్నీ చూసుకుంటూ, అక్కడక్కడ రోగుల్ని పరామర్శిస్తూ వాళ్ళకట్లు సరిగ్గా ఉన్నాయో లేదో చూసుకుంటూ పోతున్నాడు రావ్. డ్యూటీ డాక్టరు రమేశ్ ఎక్కడా కనపడలేదు. అటూ ఇటూ చూసుకుంటూ మరో వార్డులోకి ప్రవేశించాడు. డ్యూటీ డాక్టరు రమేశ్, నర్సులు అంతా ఒక్కచోట గుమిగూడి ఉండటం చూసి గబగబా అక్కడికి వెళ్ళాడు. కల్నల్ రావ్‌ని చూసి కొందరు తప్పుకొని దారిచ్చారు.

బెడ్‌మీద ఉన్న పేషెంటును చూసి గతుక్కుమన్నాడు రావ్. పేషెంటు తలదగ్గర కుర్చీలో కూర్చున్న రమేశ్ లేచి నుంచుని శాల్యూట్ చేశాడు. తరువాత దీర్ఘంగా నిట్టూరుస్తూ "వచ్చారా డాక్టర్! మీకోసం ఫోన్ చేద్దామని అనుకుంటున్నాను!" అన్నాడు. రావ్ ఖంగారుగా

'ఏమైంది డాక్టర్? నిన్నటివరకు బాగానే ఉన్నాడే?' అన్నాడు. రమేశ్ విచారంగా 'భార్యకు సీరియస్‌గా ఉందని టెలిగ్రాం వచ్చింది. అదిచూసి స్పృహలేకుండా పడిపోయాడు. బాగా షాక్. గ్లూకోజ్ ఇంజక్షన్ ఇచ్చాను!" అన్నాడు. రావ్ పల్స్ చూశాడు. రమేశ్ అందించిన స్టెత్ అందుకుని రోగిని పరీక్షించాడు. కల్నల్ రావ్ ముఖకవళికలు గమనిస్తున్న రమేశ్ మనోహరన్ పరిస్థితి విషమంగా ఉందని గ్రహించాడు. బెడ్ ప్రక్కన కూర్చున్న రావ్ లేచి నిలబడ్డాడు. రమేశ్‌తో "సెరిబ్రల్ హెమరేజ్‌లా ఉంది! పూర్‌ఫెలో, వుయ్ విల్ ట్రై అవర్‌బెస్ట్!" అని జరగవలసిన చికిత్స గురించి వివరించాడు. రమేశ్ జాగ్రత్తగా విన్నాడు. కావలసిన మందులు స్వయంగా తేవటానికి స్టోర్స్‌వైపు వెళ్ళాడు.

కల్నల్ రావ్ మనోహరన్ బెడ్ ప్రక్కన కుర్చీలో కూర్చున్నాడు. చుట్టూ ఉన్నవాళ్ళందరినీ అక్కణ్ణించి పంపించేశాడు. అవసరం వస్తే పిలుస్తానని చెప్పి నర్సుల్ని కూడా పంపించేశాడు. వాళ్ళు అతని ఆజ్ఞాబద్ధులై భయంభయంగా అక్కడినుంచి వెళ్ళిపోయారు.

రావ్ కుర్చీలో వెనక్కి జేరబడి కాలుమీద కాలు వేసుకుని కూర్చున్నాడు. చేతికి చెంపకి ఆనించి ఆలోచిస్తూ కూర్చున్నాడు. నల్లటి అతని రిస్ట్‌వాచ్ శబ్దం అతనికి విషాదంగా వినిపిస్తున్నది. అతను తన ఎదురుగా అచేతనంగా పడిఉన్న మనోహర్‌ని చూశాడు. అతని మనస్సు గతంలోకి జారిపోయింది. . . .

ఆర్నెల్ల క్రితం ఒకనాటి సాయంత్రం రావ్‌కి ఏమీ తోచలేదు. క్లబ్బుకి వెళ్ళాలనిపించలేదు. మనస్సు బాగాలేదు. తెలియకుండానే చదువుతున్న పుస్తకం చేత్తోపట్టుకునే క్వార్టర్సు వదిలి బయల్దేరాడు. అతని మనస్సులో ఏదో తెలియని దిగులుగా ఉంది. ఏకాంతంగా నడవటం రావ్‌కి చాలా ఇష్టం. అక్కడక్కడ కొండలమీద నుంచి తెల్లగా జారిపడే జలపాతాలు సూర్యకాంతిలో మెరిసిపోయే పచ్చికబయళ్ళూ, పేర్లుకూడా తెలియని రంగురంగుల చిన్ని చిన్ని పూలూ, అప్పుడప్పుడు వినిపించే పక్షుల సందడీ రావ్ మనస్సుకి హాయి కలిగించాయి. కలత, దిగులూ, అలసటా అన్నీ పటాపంచలయ్యాయి. తెలియకుండానే కల్నల్ రావ్ ఈలవేస్తూ నడవసాగాడు. ఒక్కక్షణం గడిచేసరికి తుళ్ళిపడ్డాడు, తను ఈల వెయ్యటం ఎవరైనా చూశారేమోనని. చుట్టుపక్కల ఎవ్వరూ కనపడలేదు. మళ్ళీ ఈలేసుకుంటూ హుషారుగా ఆ కొండ మలుపుల్లో నడిచిపోతున్నాడు. కొంచెం ముందుకు పోయేసరికి ఒక చెట్టు మొదట్లో ఎవరో కూర్చున్నట్లు కనిపించింది. ఎవరో తెలుసుకుందామనే

కుతూహలంతో రావ్ దగ్గరికి వెళ్ళాడు. ఆ కూర్చున్నది క్రొత్తగా కెప్టెనయిన మనోహరన్. అతను అందంగా ఉంటాడు. ఆడపిల్లలా సుకుమారంగా ఉంటాడు. పరధ్యాన్నంగా కూర్చున్న మనోహరన్ కల్నల్ రావ్ వచ్చిన చడికి తలెత్తి చూసి ఒక్క ఉదుటున లేచి నిలబడ్డాడు. శాల్యూట్ చేశాడు. రావ్ నవ్వుతూ 'డ్యూటీ వేళకాదుగా! కూర్చోండి!' అని మనోహరన్‌ని భుజం తట్టి కూర్చోపెట్టి తానూ పక్కనే చతికిలపడ్డాడు. మనోహరన్ భయంభయంగా సిగ్గుపడుతూ కూర్చున్నాడు. రావ్ ఆప్యాయంగా నవ్వుతూ "మీరీమధ్య ఇంటికి వెళ్ళివచ్చారనుకుంటా! ఇంకా తనివితీరలేదా! అప్పుడే ఇంటిమీద మళ్ళీ భ్రమ కలిగిందా?' అన్నాడు. మనోహరన్‌కి సంకోచం తగ్గింది. జేబులోని ఫోటోతీసి రావ్‌కి చూపించాడు. మనోహరన్, భార్యా ఇద్దరు కొడుకుల్తో ఉన్న ఫోటోను ఆసక్తిగా చూడసాగాడు రావ్. మనోహరన్ భార్య పెద్ద పెద్దకళ్ళూ, ఉంగరాల జుత్తుతో ఎంతో ఆకర్షణీయంగా కనపడుతున్నది. ముఖంలో చురుకుదనం, కళ ఉట్టిపడుతున్నై. 'మనోహరన్‌కి తగిన భార్య!' అనుకున్నాడు రావ్. మనోహరన్‌ఫోటోలో ఉన్న పిల్లలిద్దర్నీ చూపిస్తూ, 'వీళ్ళిద్దరూ నా కొడుకులు సార్! వీడు పెద్దవాడు శ్రీకాంత్! చిన్నవాడు శ్రీధర్! వీళ్ళిద్దర్నీ డాక్టర్లుగా చెయ్యాలని అంటుంది మా ఆవిడ సునీల!" అంటూ ఫోటోలోని భార్యను చూపించాడు. అతని కంఠంలో వ్యక్తమయ్యే ప్రేమ చూసి రావ్ హృదయం ఆర్ద్రమైంది.

రావ్ నవ్వుతూ, "తప్పకుండా నీ కొడుకులు డాక్టర్లే అవుతారు. నీ భార్య చాలా తెలివైనదానిలా కనిపిస్తున్నది" అన్నాడు. మనోహరన్ ఏదో ఆలోచిస్తున్నట్లు "అవునుసార్! తెలివైనదే! నాకన్న తెలివైనది మేమిద్దరం పెద్దవాళ్ళని ఎదిరించి, కష్టాలకు ఎదురునిలబడి మా జీవితాలని సరిదిద్దుకున్నాము!" అన్నాడు.

కల్నల్ రావ్ ఉత్సాహంగా "మీకు అభ్యంతరం లేకపోతే మీ కథ చెప్పండి! నాకు వినాలని ఉంది. నా అధికారం హోదా అన్నీ హాస్పిటల్ లోనే. ఇప్పుడు నన్ను మీ ఆత్మీయుడుగా స్నేహితుడిగా భావించండి!" అని వినటానికి సిద్ధంగా ఉన్నట్టు విశ్రాంతిగా కూర్చున్నాడు. మనోహరన్ మొదలుపెట్టాడు. "నేను సునీ ఒకే ఊళ్ళో పుట్టిపెరిగాం. కలిసి చదువుకున్నాం. ఆమె తండ్రి ఒక గొప్ప వ్యాపారవేత్త. నేను మాతల్లిదండ్రులకి ఒకణ్ణే, నా తండ్రి ఒక బీద గుమాస్తా. ఆయన సంపాదన మా కుటుంబాన్ని పోషించడానికే చాలదు. చనిపోయిన మా పినతండ్రి భార్యనూ ముగ్గురు ఆడపిల్లల్నీ చూడవలసిన బాధ్యత కూడా మా నాన్న మీదే

పడింది. మా పెద్ద కుటుంబాన్ని బరువుగా భారంగా ఈదుతున్న మా నాన్న అకాల వృద్ధుడయ్యాడు. ఇంట్లో మా అమ్మ, పిన్ని, చెల్లెళ్లు తీరిక సమయాల్లో కొబ్బరాకులతో, ఈతాకులతో రంగు రంగుల బుట్టలవీ అల్లి అమ్మేవారు ఇలా జరిగింది నా బాల్యం.

సునీల, నేను స్కూలు ఫయినలుకి వచ్చాం. క్రమంగా మా ఇద్దరి మనస్సులు ఒకటయ్యాయి. సునీల అంతస్థుకీ, నాకూ మధ్య చాలా పెద్ద అగాధముందని నాకు తెలుసు. అందువల్ల నేను సునీలను ప్రేమించినా ఆమెను నా దానినిగా చేసుకుందామనే దురాశ పెంచుకోలేదు. ఒకసారెప్పుడో "నాకు డాక్టరవాలని ఉంది!' అని సునీలతో అన్నాను. కాని నాకు నా చదువు సాగే అవకాశం లేదని తెలుసు. తరువాత ఒకనాడు సునీల నన్ను ఏకాంతంగా కలుసుకున్నప్పుడు తన మనస్సులోని భావాలను బయటపెట్టింది. ఇద్దరం పెళ్ళి చేసుకుందామంది. నేను లేందే తను బ్రతకలేనంది. నా చదువు ఆపడానికి వీల్లేదంది. తను చెప్పినట్లు వినకపోతే ఆత్మహత్య చేసుకుంటానంది. చివరికి నేను లొంగిపోక తప్పలేదు. మా పెళ్ళి విషయం బయటికి పొక్కేసరికి మా ఇంట్లోనూ, వాళ్ళింట్లోనూ కూడా గొడవలు జరిగాయి. కాని నేను కూడా ఒక స్థిరమైన నిశ్చయానికి వచ్చి సునీల అభిప్రాయాన్ని మన్నించదలిచాను. నేను పైకివస్తే, నా సునీలతో జీవితం గడపడమే కాక, నా కుటుంబాన్ని పైకి తీసుకురావచ్చుననుకున్నాను. సునీల, నేనూ కొందరు మిత్రుల సహాయంతో రిజిస్ట్రారు ఆఫీసులో భార్యాభర్తలయ్యాము. బంధువు లెవ్వరూ మా పెళ్ళికి రాలేదు.

పెళ్ళయ్యాక ఇద్దరం వేరింటికాపురం పెట్టాం. సునీల ఉద్యోగంలో చేరింది. నేను చదువు సాగించాను. ఎన్నో కష్టాలు పడ్డాం. నేను పట్టుదలతో కృషి చేసి డాక్టరునయ్యాను. మాకిద్దరికీ చిన్నప్పుడే పెళ్ళయినా, మా ఆశయాలు నెరవేరేవరకూ పిల్లలు కలగకుండా ఉండాలన్న ధ్యేయం నెరవేరింది. ఈ లోపల మా వాళ్ళూ వాళ్ళవాళ్ళూ కూడా చల్లబడ్డారు. నేను సంపాదించటం మొదలెట్టగానే మా చెల్లెళ్ళు తమని ఉద్ధరిస్తారనే ఆశతో దగ్గరకాసాగారు. అదీ సహజమే. నేను మా సునీల సహకారంతో మంచివాళ్ళనే చూసి పెళ్ళిళ్ళు చేశాను. పెద్ద వాళ్ళంతా సంతోషించారు.

నేను మిలిటరీలో చేరడానికి కూడా మా సునీలే కారణం. జీతం ఎక్కువనీ, దేశరక్షణ కర్తవ్యమనీ నన్ను ప్రోత్సహించింది. తను ఉద్యోగం మానేసి కుటుంబ నిర్వహణ పూర్తిగా తనే తీసుకుంది నాకు మా సునీలను పిల్లల్ని వదిలి ఉండటం కష్టంగా ఉంది సార్! అందులో

ఈ మధ్య మా సునీలకి ఒంట్లో బాగులేదని ఉత్తరం వచ్చింది. అప్పణ్ణుంచీ నా మనస్సేమీ బాగులేదు!" అంటూంటే మనోహరన్ కళ్ళల్లో నీళ్ళు అస్పష్టంగా మెరిశాయి. రావ్ అతని చేతిని తనచేతిలోకి తీసుకుని ఆప్యాయంగా నొక్కుతూ "అసలు జబ్బేమిటి? ట్రీట్‌మెంటు సరిగ్గా జరుగుతోందా?" అని అడిగాడు.

మనోహరన్ దీర్ఘంగా నిట్టూరుస్తూ 'అదికాదుసార్! మా సునీలకు మళ్ళీ నెలతప్పిందని ఉత్తరం వచ్చింది. ఆమెకు మనోబలమే ఉందిగాని శారీరకంగా చాలా బలహీనంగా ఉంటుంది' అన్నాడు. రావ్ నవ్వుతూ 'కంగ్రాట్స్! సంతోషించాల్సినదానికి విచారపడతారేమిటి?' అన్నాడు. మనోహరన్ విచారంగా 'అది సంతోషించవలసిన విషయమే అయినా నాకు భయంగా ఉంది. మాకిద్దరికీ ఆడపిల్ల కావాలని ఆశ. మా సునీలకు ఇదివరకు రెండుసార్లు కాన్పు కష్టమైంది. బ్లెడ్‌ప్రషర్ ఉంది. నా కోసం సర్వస్వం ధారపోసింది. ఆమె ఆరోగ్యం గురించే నా ఆందోళన!' అన్నాడు. రావ్ లేచి నించుని 'పదండి వెళదాం! చీకటి పడిపోయింది. మీదేవూరో చెబితే అక్కడున్న లేడీడాక్టరుకి ఉత్తరం రాస్తాను. స్పెషల్ ట్రీట్‌మెంటు ఇప్పిద్దాం. అప్పుడప్పుడు ప్రోగ్రెస్ తెలుసుకుందాం!' అన్నాడు. ఇద్దరూ లేచారు. తలవంచుకుని నెమ్మదిగా మెస్‌వైపు వెళ్తున్న మనోహరన్‌ని జాలిగా చూస్తూ కల్నల్ రావ్ తన క్వార్టరు వైపు నడిచాడు.

తరువాత మనోహరన్ రావ్‌చేత వాళ్ళ ఊళ్ళోని పెద్ద లేడీ డాక్టరుకి ఉత్తరం రాయించాడు. తనూ రాశాడు. ఆమె సునీలను పరీక్ష చేసి ఫైండింగ్సూ, ఇస్తున్న ట్రీట్‌మెంటూ రాసింది తరువాత అప్పుడప్పుడు సునీల ఆరోగ్య పరిస్థితి గురించి రాసింది, సునీల గురించి భయపడాల్సిన అవసరం లేదనీ ఆమె ఉత్సాహంగా ఉందనీ రాసింది కొద్దిరోజుల క్రితం. ఆ విషయం తెలుసుకున్న మనోహరన్ హుషారుగా ఉన్నాడు.

స్టోర్స్‌లోంచి రావ్ చెప్పిన మందులు ఇంజక్షన్లు తెచ్చిన రమేశ్‌ను చూసి రావ్ ఈలోకంలోకివచ్చాడు. అతని చేతిలోని ఇంజక్షన్ తీసుకుని మనోహరన్‌కి తానే ఇచ్చాడు. రాత్రంతా అతని పక్కనే ఉండి, అతను చేసే చికిత్సను పరిశీలిస్తూ ఆతృతపడుతున్నాడు మనోహరన్‌కి మరో ఆత్మీయుడైన కెప్టెన్ రమేశ్.

కల్నల్ రావ్ చేస్తున్న చికిత్సను తోసివేసి తానే జయించినట్లు మృత్యువు వికటాట్టహాసం చేసింది. మనోహరన్ ఈ లోకాన్ని వదిలి వెళ్ళిపోయాడు. అతని చెయ్యి

వదిలేసి, తన శక్తినంతా గోల్పోయినట్లు వణుకుతూ రమేశ్ భుజంమీద చెయ్యిమోపి నుంచున్నాడు రావ్. ఈ విషయం తెలిసేసరికి డాక్టర్లు, నర్సులు, సైనికులు, ఉద్యోగులు అంతా మనోహరన్‌ని ఆఖరిసారిగా చూడటానికి వచ్చి చూచి వెళ్తున్నారు. వణుకుతున్న శరీరాన్ని అదుపులో పెట్టుకొని రమేశ్ ఆసరాతో నుంచున్న కల్నల్ రావ్‌కి ఒక ఆర్డర్లీ టెలిగ్రాం అందించాడు. అది చూసిన తరువాత అతని ముఖం మరీ వివర్ణమయింది. మనోహరన్ భార్య ఆడపిల్లను ప్రసవించి చనిపోయినట్టు వార్త తెచ్చిన టెలిగ్రాం అది. రావ్ కళ్ళనుండి కారుతున్న అశ్రుధారలను చూచి అక్కడివారంతా చలించిపోయారు. రమేశ్ రావ్ చెయ్యి పట్టుకుని క్వార్టర్సుకి తీసుకువెళ్ళాడు. ఎఱ్ఱగా మండుతున్న జ్యోతుల్లా ఉన్న కల్నల్ రావ్ కళ్ళను చూసి అతణ్ణెవరూ పలకరించటానికి సాహసించలేదు. రమేశ్ తన గుండెల్లో మండే అగ్ని పర్వతాన్ని అణుచుకుంటూ రావు చేత బలవంతంగా కాఫీ తాగించాడు.

రావు కాఫీతాగి రెండుకళ్ళమీద చేతులుపెట్టుకొని సోఫాలో వెనక్కి జేరబడిపోయాడు. ఆ సమయంలో కల్నల్ రావుకి ఒక కెప్టెన్ మరణించాడనిగానీ- అతని భార్య చనిపోయినట్లు టెలిగ్రాం వచ్చిందనిగాని అనిపించడంలేదు. అప్తులిద్దరిని పోగొట్టుకొన్నవాడిలా దుఃఖిస్తున్నాడు రావు. అతని ఆవేదన చూసి చలించిపోయిన రమేశ్ పక్కనే మౌనంగా కూర్చున్నాడు.

మరణించిన మనోహరన్‌కి అంత్యక్రియలకి మరొకగంటలో హడావుడిగా ఏర్పాట్లు జరిగాయి. మనోహరన్ భౌతిక దేహాన్ని పూలతో అలంకరించిన ట్రక్కుపై పెట్టారు. సైనికులు తుపాకులు తిరగేసి పట్టుకున్నారు. అధికార లాంఛనాలతో అంత్యక్రియలు జరిపిస్తున్నారు. అందరికంటె ముందు, అధికార హోదాలో అటెన్షన్‌లో నుంచున్న కల్నల్ రావు మదిలో సునీల మెదిలింది. భవిష్యత్తు మీద బ్రతుకుమీద ఎన్నో ఆశలు పెట్టుకున్న ఆ దంపతుల కోసం అతని హృదయం ఆక్రోశించింది. ఆ విధివంచితుల నిద్దరినీ తల్చుకుంటున్న అతని మనస్సును విషాదమేఘం ఆవరించింది. అంతవరకూ చూస్తున్నట్లున్న సూర్యుడు కూడ ఇంక ఆ దృశ్యాన్ని చూడలేన్నట్లు మేఘాల తెరలోకి తప్పుకున్నాడు.

-:0 0 0 :-

# కొత్తవెన్నెల

బస్సు ఇంకా రాలేదేమిటని టైం చూసుకుంటున్న శకుంతల " హలో!" అన్న పలకరింపు విని పక్కకి తిరిగి చూసింది. ఎదురుగా ఒకప్పటి కొలీగ్ మాధవి. ఆమె పక్కనే స్కూటరుమీద ఓ యువకుడు. శకుంతల ఆశ్చర్యంగా "నువ్వా? ఇప్పుడెక్కడ ఉద్యోగం? ఎలా ఉన్నావే?" అంటూ పలకరించింది. మాధవి కులుకుతూ ముద్దమాటల్తో స్కూటరుమీద కూర్చున్న యువకుణ్ణి చూపించి, 'ఆయనకే ఉద్యోగం. నాకు లేదు. ఈ మధ్యనే ఇక్కడికి వచ్చాం. మా ఇంటికోసారి రా!' అంటూ ఇంటి నెంబరు చెప్పి వెళ్ళిపోయింది. ఎండాకాలపు సాయంత్రం లేచిన సుడిగాలి ఎన్నికల సంరంభంలా వచ్చి, బస్సు కోసం నిల్చున్న వాళ్ళ కళ్ళల్లో దుమ్ము కొట్టి వెళ్ళిపోయింది. శకుంతల కర్చీఫ్ ముక్కుకి అడ్డం పెట్టుకుంది.

శకుంతల మళ్ళీ చేతి వాచీ చూసుకుంది. తను బస్సు స్టాపుకి వచ్చి పదిహేను నిమిషాలయింది ఇంకా బస్సు రాలేదు. కాళ్ళు పీక్కుపోతున్నై. 'ఆటోలో వెళ్ళవచ్చు కానీ నెల మొదట్లోనే డబ్బు ఖర్చుపెట్టేస్తే, నెలాఖరుకి ఇబ్బంది పడాల్సి వస్తుంది!" అనుకుంది శకుంతల ఆలోచనలు మాధవి వైపుకి వెళ్ళినై. ఎలా ఉండేదో జిడ్డు మొహంతో జడ్డిగా ఉండేది. "ఈమె గారి నెవడు చేసుకుంటాడ్రా బాబూ!" అని ఒకళ్ళిద్దరు మొగాళ్ళు జోకు చెయ్యడం కూడా తెలుసు. "భర్త బాగానే ఉన్నాడు. మంచి ఉద్యోగమే ఉండి ఉంటుంది." అనుకుంది. రకరకాల బస్సుల్తోను, మనసుల్తో, కార్లతో, లారీలతో, ఆటోల్తో, రిక్షాల్తో శకుంతల కళ్ళముందు దృశ్యం సినిమా రీలులాగా క్షణం క్షణం మారిపోతోంది మనస్సులో. గతంలోని దృశ్యాలు కూడా మారిపోతున్నాయి. అన్నీ మారుతున్నాయి. శకుంతల జీవితంలో మార్పులేదు. వయస్సు పదేళ్ళు పెరిగింది. సర్వీసులో పదేళ్ళు పెరిగింది. జీతం పెరిగింది. జీవితం మాత్రం యాంత్రికంగా నిస్సారంగా గడిచిపోతున్నది. దీర్ఘంగా నిట్టూర్చి బస్సు రావలసిన వైపు చూసింది. బస్సు వస్తున్నది. శకుంతల ఆ బస్సు నెంబరు ఎంత దూరం నుంచైనా కనిపెట్టగలదు.

బస్సు ఆగవలసిన చోటుకి పదిగజాలు ముందుకెళ్ళి ఆగింది పుట్ బోర్డు మీద కూడా జనం వేలాడుతున్నారు. బస్సు బరువుతో ఒక పక్కకి వంగి ఉండడం చూసి శకుంతల

గుండె దడ దడ కొట్టుకుంది. ఈ బస్సు పోతే మళ్ళీ నలభై నిమిషాల వరకూ బస్సు రాదు. పరుగెత్తుకు వెళ్ళింది బస్సు కోసం. బస్సులోంచి ఒకరిద్దరు దిగగానే కండక్టర్ బెల్ కొట్టేశాడు. చొరవగా ఎక్కేసింది. ఎలాగో అలా లోపలికి తోసుకుంటూ వెళ్ళి మధ్య రాడ్ పట్టుకునిల్చుంది. బస్సులో జనం ఎక్కువగా ఉండటం వల్ల శకుంతలకు ఊపిరాడటం లేదు. మరీ ఒకరినొకరు అంటుకు నిల్చున్నారు. లేడీస్ సీట్లవైపు ఆశగా చూసింది. ఎక్కడా ఖాళీలేదు. "ఆటోలో వెళ్ళిపోవలసింది" అనుకుంది. తన దగ్గర డబ్బులయిపోతే కష్టం. ఎవర్నడుగుతుంది, "డబ్బులు అయిపోయాయి!" అని ఇంట్లో స్వగతంలా అనుకున్నా ఎవరూ మాట్లాడరు అడగడానికి అభిమానం అడ్డువస్తుంది. శకుంతల విరక్తిగా "ఏమిటో ఈ జీవితం? ఎందుకు బ్రతుకుతున్నానో తెలియడం లేదు!" అనుకుంది.

శకుంతలకి కాళ్లు లాగుతున్నై. జారిపోతున్న వేనిటీ బ్యాగును పైకి జరుపుకుంది. పళ్ళూ, పూలూ అవీ కొన్నదేమో బాగ్ బరువెక్కి చెయ్యిలాగుతోంది ఇలా నిలబడి కనీసం ఇంకో 25 నిమిషాలు ప్రయాణం చెయ్యాలనుకునేసరికి శకుంతలకి ఎక్కడలేని నీరసం వచ్చేసింది. ఆమె శరీరానికి వెనక నిల్చుకున్న ఇంకొకరి శరీరం తగుల్తోంది. కొంచెం ముందుకు జరిగింది. కొంచెం కూడా స్థలం లేదు. వెచ్చని ఊపిరి మెడమీద తగుల్తోంది. చవకరకం సెంటువాసన చెమటతో కలిసి కడుపులో దేవుతోంది. వెనక ఎవరో కావాలని మరీ తగుల్తున్నారు మొరటు చేతులు కావాలని తాకుతున్నట్లయి శకుంతలకి ఒళ్ళు జలదరించింది. వెనక్కి తిరిగి చూసింది కాకి పేంటు, పూలషర్టు ముఖం మీద పడిన జుట్టును పైకి తోసుకుంటూ ముఖం పక్కకి తిప్పుకొని, ఏమీ ఎరగనట్లు ఎటో చూస్తున్న యువకుడు కనిపించాడు.

శకుంతల అతనికేసి తీక్షణంగా చూస్తూ "బుద్ధిలేకపోతే సరి! సరిగ్గా నిల్చోవాలి! లేదా వెనక్కి వెళ్ళాలి!" అన్నది. ఆతనామె ముఖం చూసి వెనక్కి జరిగి నిల్చున్నాడు. బస్సులో మనుషులు తగుల్తారని అనుకుంటే ఆటోలోనో, ట్యాక్సీలోనో వెళ్లవచ్చు కదా!" అన్నాడు వ్యంగ్యంగా పళ్ళన్నీ కనపడేటట్లు నవ్వుతూ, చుట్టూ ఉన్న మరో నలుగురు కుర్రాళ్లు నవ్వారు, శకుంతల శరీరం ఉడికిపోయింది. వాచీ చూసుకుంది. కనీసం ఇంకో ఇరవై నిమిషాలు ప్రయాణం చేస్తే గాని గమ్యస్థానం చేరలేదు. పక్కసీట్లో కూర్చున్న పెద్దమనిషి కలగజేసుకుని "ఇందాకటి నుంచీ చూస్తున్నాను! ఆడవాళ్ల దగ్గరే నిల్చున్నారు. ఆమె ఎంత సర్దుకుని

ముందుకు జరిగినా, ఇలా మీద పడేటట్లు నిలబడకపోతే వెనకంత చోటుంది వెళ్ళి నిలబడరాదూ?" అన్నాడు. ఇంకో కుర్రాడు "ఓహో మీ తాలూకా! అంత ఇదయితే ఆటోలో తీసుకెళ్ళండి!" అన్నాడు. పెద్దమనిషి 'ఏంకూశావ్?' అంటూ షర్టు చేతులు పైకి తీశాడు. బస్సాగిపోయింది. కండక్టరు వచ్చి, "వాళ్ళతో మీకేమిటిసార్! ఊరుకోండి !"అని సర్దిచెప్పాడు. శకుంతల ముఖం సిగ్గుతో ఎర్రబడింది. నెక్ట్స్ స్టాప్‌లో కుర్రాళ్లంతా దిగిపోయారు.

లేడీస్ సీటు ఖాళీ అయితే శకుంతల వెళ్లి కూర్చుంది. తనని సపోర్టు చేసిన పెద్దమనిషి వైపు చూసింది. ముప్పై అయిదేళ్లకి పైనే ఉంటాయి. ఒడ్డూ పొడుగూతో హుందాగా ఉన్నాడు. అక్కడక్కడ తెల్లవెంట్రుకలు ఉంగరాల క్రాఫింగులో కనిపిస్తున్నై. లేత పసుపురంగు షర్టులోంచి కనిపిస్తున్న పచ్చటి చేతులూ, చేతికున్న లేటెస్ట్ మోడలు రిస్ట్‌వాచ్ పరీక్షగా చూసింది శకుంతల. అతన్ని ఎక్కడో చూసినట్లనిపించింది. మళ్లీ ' ఆ ఏమోలే! ఈ సిటీలో రోజూ బస్సుల్లో తిరిగే మొహాలు మళ్లీ మళ్లీ కనపడుతుంటై' అనుకుంది. శకుంతల దిగవలసిన చోటు వచ్చేసింది. బస్సు దిగేసింది. అతనూ దిగాడు. శకుంతల 'అతను ఎటు వెళ్తాడా?' అని చూసింది. తన వెనకే వస్తున్నాడు. దగ్గరకి రాగానే 'థాంక్స్! నా గురించి మీరు పోట్లాడారు. దరిద్రపు వెధవలు. మరీ అసహ్యంగా ప్రవర్తిస్తుంటే భరించలేకపోయాను!' అంది, అతను 'ఫరవాలేదు, నేను వాడి చేష్టలు గమనిస్తూనే ఉన్నాను! మీరు దుర్గారావు గారమ్మాయి కదూ! రామం చెల్లెలివి కదూ! అన్నాడు. శకుంతల ఆశ్చర్యంగా 'అవునండీ! మిమ్మల్ని ఎక్కడో చూసినట్లుంది' అన్నది. అతను నవ్వుతూ 'నేను మీ రామం అన్నయ్య ఫ్రెండ్ శర్మని!' అని రహస్యం చెబుతున్నట్లు 'మీకు తప్పిపోయిన పెళ్లికొడుకుని' అన్నాడు.

శకుంతల ఒక్కక్షణం తెల్లబోయి 'ఈ వూళ్లో ఏం చేస్తున్నారు? అనడిగింది. అతను నవ్వుతూ మీలాగే ఉద్యోగం చేస్తున్నాను. ఈ మధ్యనే ఈ ఊరు బదిలీ అయి వచ్చాను. ఇక్కడే మా స్నేహితుడితో ఉంటూ ఇల్లు వెతుక్కుంటున్నాను!' అన్నాడు. శకుంతల 'ఇక్కడే మా ఇల్లు. రండి! ఒక కప్పు కాఫీ తాగి వెళ్దురుగాని' అన్నది. అతడు కాఫీయేనా అన్నాడు. శకుంతల 'భోజనం చేద్దురుగాని రండి!' అన్నది. శకుంతల వెంట అతనూ నడిచాడు. ఇల్లు తాళం చూసేసరికి శకుంతల ఉసూరుమంది.

పక్కవాటావాళ్ల గోపీ వచ్చి 'ఆంటీ! మీ వాళ్లు సినిమాకు వెళ్లారు. మీకు తాళం ఇమ్మన్నారు' అని తాళం చేతులో పెట్టి వెళ్ళిపోయాడు. శకుంతల తాళం తీసి 'రండి,

కూర్చోండి!' అంటూ శర్మని ఆహ్వానించి లోపలికి వెళ్లింది. శర్మ రుమాల్తో ముఖం తుడుచుకుంటూ గోడల మీద పెళ్లిఫోటోలు చూస్తున్నాడు. శకుంతల తెచ్చిన ట్రేలో కాఫీ, మంచినీళ్లు అందుకొన్నాడు. ఇద్దరూ కాఫీలు తాగుతున్నారు. శర్మ శకుంతలని చూస్తున్నాడు- 'ఏమీ మారలేదు. అదే చిరునవ్వు. వయసు వచ్చినా అందంగానే ఉంది' అనుకున్నాడు. గాలికి కదిలే శకుంతల ముంగురులు ఆమె ముఖంమీద నాట్యం చేస్తుంటే ఎడంచేత్తో సరిచేసుకుంటోంది.

నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ శర్మ 'ఏమిటి సంగతులు? చాలా రోజులైంది మనం కలుసుకుని. రామం అప్పుడప్పుడు రాస్తుంటాడు!' అన్నాడు. శకుంతల నవ్వి 'ఏమున్నాయి? నాన్న రిటైరయారు. ఈ ఇల్లు కట్టించారు. రోహిణికి పెళ్ళయింది. అవతల వాటాలో ఉంటున్నారు. గోపీ భార్య టీచరు. మేమంతా కలిసే ఉంటున్నాం' అని తలవంచుకుంది.

శర్మలేచి శకుంతల పక్క కుర్చీలో కూర్చున్నాడు. సున్నితంగా ఆమె గడ్డం కింది చెయ్యి పెట్టి తలపైకెత్తి 'శకుంతలా! నువ్వెందుకో బాధపడుతున్నట్లున్నావు? నాకు చెప్పు! నావంక చూడు!' అన్నాడు. శకుంతల అతని చేతిని తోసేస్తూ 'ఏంలేదు!' అన్నది. 'ఏంలేకపోవడమేమిటి, చాలా ఉంది! నువ్వు సంతోషంగా ఉండాలి! మనం పెద్దవాళ్ళమయ్యాం. నువ్వు సంతృప్తిగా సంతోషంగా ఉండటమే నాకు కావాలి! అందుకు నేనేమైనా చేస్తాను! నీకు ఏలోటూ రానివ్వను!' అంటూ ఆమె చెయ్యి అందుకోబోయాడు.

శకుంతల అపర కాళికలా నిల్చుంది.

'ఏయ్ మిస్టర్! అన్నయ్య స్నేహితుడవని మరియాద ఇచ్చాను. నీకు ఇల్లు దొరికే వరకూ నీ భార్యా బిడ్డల్ని తీసుకురావటానికి వీల్లేదు. ఈ లోగా కాలక్షేపానికి నన్ను ఉపయోగించుకోవాలని అనుకుంటున్నావేమో! దయచెయ్!' అంటూ వీధివైపు వేలు చూపించింది, కోపంగా.

శర్మ పకపక నవ్వసాగాడు. శకుంతల బిత్తరపోయి నిల్చుంది. శర్మ నవ్వుతూ, కుర్చీలో కాలిమీద కాలువేసుకుని వెనక్కి జేరబడి కూర్చుంటూ 'పిచ్చీ! ఈ శర్మ ఎలాంటివాడో నీకు తెలీదు! నాకు పెళ్లయిందని ఎవరు చెప్పారు? నేను వెళ్లిపోతాను గానీ నువ్వు శాంతించు!' అన్నాడు.

శకుంతల సిగ్గుతో ముడుచుకుపోయింది. శర్మ 'ముందు కొంచెం మంచినీళ్లు తెచ్చిపెట్టు! ' అన్నాడు. శకుంతల తెచ్చిచ్చిన మంచినీళ్లు తాగేసి గ్లాసు కిందపెట్టి 'కూర్చో!' అన్నాడు. శకుంతల మౌనంగా కూర్చుంది. శర్మ గొంతు తగ్గించి , 'నీకోసమే నేను పెళ్ళిచేసుకోకుండా కాచుకుని ఉన్నాను. నువ్వు ఈమధ్య పెళ్ళి వద్దంటున్నావనీ, విరక్తిగా మాట్లాడుతున్నావనీ మీ అన్నయ్య రాశాడు. నీకోసమే ఈ ఊరు ట్రాన్స్ఫర్ చేయించుకున్నాను. మీ ఇంటికనే బయల్దేరాను. అనుకోకుండా బస్‌లో నీ స్వభావం తెలుసుకోవడం జరిగింది, నీకోసం వాళ్లతో కొట్లాటకి సిద్ధపడ్డాను. నువ్వు 'ఊ' అనాలి. రామానికి రాస్తాను. పదిపదిహేను రోజుల్లోగా పెళ్లయిపోవాలి. నువ్వు నేను కలిసి కొత్త జీవితం ప్రారంభించాలి' అన్నాడు ఆవేశంగా. శకుంతల నసుగుతూ 'ఇంత పెద్దయ్యాకా!' అంది.

శర్మ 'ఓస్ అదా! చిన్నప్పుడు అక్కచెల్లెళ్లూ, అన్నదమ్ములూ అంతా ఉంటారు. పెద్దయ్యాక ఎవరి మట్టుకు వారు వెళ్లిపోయాక ఒంటరితనం. చిన్నప్పుడు మా నాన్నడిగిన కట్నం మీవాళ్లివ్వలేదని మన పెళ్లి తప్పిపోయింది. ఇప్పుడు మా అమ్మా, నాన్న స్వంత ఊరొదిలి రారు. చెల్లెలు సుగుణ పెళ్లయి వెళ్లాక ఇంటికి వెళ్లినా నాకు కంపెనీ లేదు. ఇప్పుడు అందరినీ ఎదరించయినా నిన్ను చేసుకోవాలని నిశ్చయించుకున్నాను. అదీ నీకిష్టమయితేనే! మనిద్దరం కలిసి సహజీవనం ప్రారంభిద్దాం. ఎవరో ఏదో అనుకుంటారని అనుకోవద్దు. మనం స్వతంత్రులం. ఎవరి సలహా అడగక్కరలేదు, ఏ సంగతీ ఆలోచించుకుని నాకు రేపు ఫోన్‌లో చెప్పు!' అన్నాడు. శకుంతల అతని వైపు ఆశ్చర్యంగా చూసింది, శర్మలేచి నిలబడి 'ఇక నేను వెళ్లనా? రేపు వస్తాను. ఆలోచించుకో!. రేపు ఇవాళలా తిడితే ఊరుకోను!' అన్నాడు. శకుంతల అతనిదగ్గరగా వచ్చి 'సారీ' అన్నది. ఆమె చేతిని ఆప్యాయంగా తట్టి 'డోంట్ వరీ!' అంటూ వెళ్ళిపోయాడు.

శకుంతల కుర్చీలో కూర్చుండి పోయింది. గతంలోని సంఘటనలు ఆమె కళ్లముందు కనపడసాగాయి. రామం అన్నయ్యతో అప్పుడప్పుడు వచ్చే శర్మ అందంగా ఉండేవాడు. ఆ మాటే కమలక్కతో అంటే 'తప్పే! మగవాళ్లు అందంగా ఉన్నారని ఆడపిల్లలు పైకి అనకూడదు!' అంది. పదహారేళ్ల శకుంతల. 'అయితే మనస్సులో అనుకోవచ్చా!' అంటే అక్క నవ్వింది. శర్మ తనతో కాస్త చనువుగానే ఉండేవాడు. వాళ్లడిగిన కట్నం ఇవ్వలేక సంబంధం

తప్పిపోయింది. ఆ కబురు విని కొందరు వెనక్కి వెళ్లారు. మరి కొందరికి శకుంతలకు నచ్చలేదు. మొత్తానికి శకుంతల పెళ్లికాకుండా ఉద్యోగంలో స్థిరపడింది.

శకుంతల మనస్సు శర్మ చెప్పిన విషయం చుట్టూ పరిభ్రమించసాగింది. తను సాధించినదేమిటి? పెళ్లికాని తన గురించి స్వేచ్ఛగా ఉందని పైకి మెచ్చుకోలుగా మాట్లాడుతూ, లోలోపల చిన్నచూపు చూస్తున్నారని తెలుసు. తను పువ్వులు తెస్తుంది అందరికీ. ఇంట్లో చెల్లెలో, మరదలో అయితే తనగురించీ ఆలోచించరు. భర్తల్తో బయటికి వెళ్లినప్పుడు కొనుక్కుని తలనిండా పెట్టుకుని వచ్చేస్తుంటారు. గోపీ భార్యే నయం. అప్పుడప్పుడు 'గూట్లో పువ్వులు పెట్టాను వదినా నీకోసం' అంటుంది; బయటికి వెళ్తూ. గోపీ, రోహిణీ కూడా అక్క అనే మనిషి ఉందనే మర్చిపోతుంటారు. ఎవరి మట్టుకు వాళ్లు సినిమాలకూ, షికార్లకూ వెళ్లిపోతుంటారు. ఇక అమ్మా, నాన్నా! వాళ్లిద్దరూ కాస్సేపు వాదించుకున్నా మరి కాస్సేపు సరదాగా నవ్వుకుంటారు. ఎక్కడికైనా వెళ్తుంటే 'నువ్వూ వస్తావుటే! రారాదూ!' అంటుంది. ఆ పిలుపులో 'నువ్వొద్దులే' అనే భావమే శకుంతలకు వినిపిస్తుంది.

శకుంతల మనస్సును అదుపులో పెట్టుకుంది. మర్నాడు శర్మకి పచ్చజెండా చూపించి, పట్టాలు మార్చి కొత్తపట్టాల మీద శర్మతో జీవిత గమనం సాగించాలని నిశ్చయించుకుంది. శకుంతల జీవితంలో వసంతం విరిసింది. కిటికీనుంచి గదిలోకి పాకుతున్న వెన్నెల శకుంతల మనస్సును కొత్తకాంతితో నింపింది.

సినిమా నుంచి వచ్చిన వాళ్లకి, శకుంతల ముఖంలోని కొత్తకళ ప్రశ్నార్థకమే అయింది. అది శకుంతల జీవితంలోకి ప్రసరించిన కొత్తవెన్నెలవల్లనేనని వాళ్లకి వెంటనే తెలియదుగా మరి!

-:o o o :-



# రచయిత్రి - పరిచయం

విద్య : ఎం.ఏ (తెలుగు సాహిత్యం) ఉస్మానియా విశ్వవిద్యాలయం.

వృత్తి : స్త్రీశిశు సంక్షేమశాఖలో, యువజన సంక్షేమశాఖలో పని చేశారు. స్త్రీశిశు సంక్షేమ శాఖలో, రీజనల్ వేర్‌హౌస్ మేనేజరుగా (ఐ.సి.డి.యస్) కాకినాడలో పదవీ విరమణ చేశారు. తరవాత డా.తిరుమల రామచంద్రగారి పర్యవేక్షణలో ఓరియంటల్, మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో "శబ్దార్థ సర్వస్వం" ప్రాజెక్టులో నాలుగు సంవత్సరాలు పనిచేశారు.

ప్రవృత్తి : చిన్నప్పటి నుంచీ సాహిత్యాభిమానం అలవడింది. కథలు, కవితలు, ప్రసంగాలు హైదరాబాదు ఆకాశవాణికేంద్రం నుండి ప్రసారం అయ్యాయి. 1963 నుంచీ రచనా వ్యాసంగం. అనేక కథలు, వ్యాసాలు, కవితలు వివిధ పత్రికల్లో వెలువడ్డాయి. కవితా సంపుటాలలో కొన్ని కవితలు చోటు చేసుకున్నాయి. వివిధ సాహిత్య సంస్థలతో అనుబంధం ఉంది. విశ్వసాహితి కోశాధికారిగా/కార్యదర్శిగా 25 సం॥ పని చేశారు. సాహితీ విద్యాలయ నిర్వహణలో తోడ్పడ్డారు. నవయువ రచయితల సభలు విజయవంతం కావడానికి కృషిచేశారు. అఖిల భారత తెలుగు రచయితలు/రచయిత్రుల సభల్లో ప్రపంచ తెలుగు మహా సభలలో పాల్గొన్నారు. ఏ కార్యక్రమం అయినా విజయవంతం అవడమే లక్ష్యంగా కృషి చేసే కార్యకర్తగా పేరు తెచ్చుకున్నారు. అఖిల భారతీయ భాషా సమ్మేళనంలో కార్యనిర్వాహక సభ్యులు.

రచనలు : దాదాపు 100 కవితలు, 50 కథలు, 25 వ్యాసాలు, ఛలోక్తులు (కూర్పు).

తొలి కవితా సంకలనం : కనిపించిన దేవుడు.

అనువాదాలు : దాదాపు పది కథలు తమిళం నుంచి తెలుగులోకి అనువదించారు. కొన్ని విపుల మాసపత్రికలలో ప్రచురింబడ్డాయి. కేంద్రసాహిత్య అకాడమీ ఆధ్వర్యంలో జరిగిన అనువాదాల కార్యగోష్ఠిలో పాల్గొని, కొన్ని కథలు తమిళం నుంచి తెలుగులోకి అనువదించారు. "శిలప్పది గారం" తెలుగులోకి అనువదించారు.

బహుమతులు : వ్యాసాలకు, కవితలకు, హాస్యకథలకు పలు బహుమతులు లభించాయి.